శ్రీ తిరుపతి దేవస్థానమువారిచే ప్రారంభించబడిన
ధార్మిక గ్రంథ ప్రచురణ సహాయ ప్రణాళికక్రింద
ఇయ్యబడిన విరాళముతో
ముద్రింపబడినది.

రామాయణసుధ

## అరణ్యకాండ

| వరుస నెం. | విషయసూచిక | పుట |
|---|---|---|
| 1 | రాముడు తాపసాశ్రమములకు పోవుట | 1 |
| 2 | రాముడు విరాధుని చూచుట | 4 |
| 3 | లక్ష్మణుఁడు విరాధుని జంపెద ననుట | 6 |
| 4 | విరాధుఁడు రామలక్ష్మణులఁ దాకుట | 8 |
| 5 | విరాధుని పూర్వజన్మ- గోతిలో పూడ్చుట | 10 |
| 6 | రాముని శరభంగ దర్శనము | 12 |
| 7 | రాముఁడు శరభంగుని గలియుట | 14 |
| 8 | ఋషులు రాముని దర్శించుట | 16 |
| 9 | రాముఁడు సుతీక్ష్ణుని జూచుట | 18 |
| 10 | సుతీక్ష్ణుఁడు రామాదుల సత్కరించుట | 20 |
| 11 | రాక్షసులతో పగ వలదని సీత చెప్పుట | 22 |
| 12 | రాముడు ఆర్తులగు మునుల రక్షింతు ననుట | 26 |
| 13 | మాండకర్ణి ఆశ్రమ దర్శనము | 30 |
| 14 | రాముఁడు అగస్త్యుని ఆశ్రమమ్మున కేగుట | 32 |
| 15 | అగస్త్య భ్రాత ఆశ్రమమున కేగుట | 34 |
| 16 | రాముఁడు అగస్త్యుని చూచుట | 38 |
| 17 | రామునికి అగస్త్యు డాయుధముల నిచ్చుట | 40 |
| 18 | దండకారణ్య కథ | 42 |
| 19 | జటాయువు వంశ వర్ణన | 46 |
| 20 | రాముడు చిత్రకూటమ్ము నుండగోరుట | 48 |
| 21 | హేమంతఋతు వర్ణన | 50 |
| 22 | రాముడు భరతుని మెచ్చుకొనుట | 54 |
| 23 | రాముని శూర్పణఖ చూచుట | 56 |
| 24 | శూర్పణఖ తన కథ చెప్పుట | 58 |
| 25 | శూర్పణఖతో రామలక్ష్మణుల పరిహాసము | 60 |

—:×:—

గణపతి

# రామాయణసుధ

## అరణ్యకాండ

### —: రాముడు తాపసాశ్రమములకు పోవుట :—

ఎదురు కొనరాక యాత్మను నెఱఁగు రాము
* డవల దండకారణ్యము నందుఁ జొచ్చి
తాపసులు నివసింపఁగఁ దనరియున్న
తాప సాశ్రమ మండల స్థాన మరసె. 1

వ. ఆయాశ్రమ మండలమున. 2

వెలిఁగెడి సూర్య మండల మటు దర్భల
వల్కలమ్ముల బ్రాహ్మవర్చ సలర
ఎల్ల ప్రాణికి శరణిడి, తుడిచిన వాకి
ళుల మృగ పక్షుల కులము లెసగ

స్రుక్స్రువములు కుశల్ శుభ చర్మల నగ్ని
గృహముల నచ్చరల్ నృత్య మడర
సమిధలు జలకుంభ సమితి పండ్లును వేళ్ళు
స్వాదు ఫల వన వృక్షములు దనర

---

* నేటి మహారాష్ట్రమె దండకారణ్యమని వ్యాఖ్య.

హోమములు వ్రేల్చి బలి వేదసామ లొప్ప
వనసుమాలు పద్మ సరసీవ్రాత మమర
వేళ్ళు పళ్ళులు తిని దాంతి లేళ్ళచర్మఁ
దాల్చి వన్ని సూర్యాభులౌ తపసు లుండ్రు. 3

అనఘులై యతాహారులౌ మునుల దనరి
బ్రహ్మ లోకము మున్నటు బ్రహ్మఘోష
బ్రహ్మవిదులైన బ్రాహ్మణుల్ సలుపు చుండ
రాముఁ డరసె నాతాపసాశ్రమ పదంబు 4

ధనుసు నుండి యానారియు త్వరగ దీసి
యింక సుతేజుఁడౌ రాముఁడు ఋషుల మ్రొక్క
ప్రథిత దివ్య విజ్ఞానులు వారు రాము
నరసి యతని చెరికి వచ్చి రాదరమున. 5

వచ్చి ధర్మచారులు దృఢవ్రతులు ఋషులు
రామునకు జనకజకును లక్ష్మణునికి
మంగళాశీస్సులిడి వారి మంగలక్ష్మి
చారు సౌకుమార్యములకు నాశ్చర్య పడిరి. 6

వారి వేషము నావనవాసు లెల్ల
జెప్పపాటు వేయక కన్ను లప్పగించి
సురల వలెఁ జూచి భూత శుభము చేయు
రామునకుఁ జేసిరతిథి మర్యాద మిగుల. 7

అవల వారికి మర్యాద లాచరించి
ధర్మ చారులు నీళ్ళును తగిన పండ్లు
విరులు దుంప లాశ్రమ మరయఁ జేసి
నిటు నివేదించి కేలొగ్గి యిట్టు లనిరి. 8

వనులందున్న మమున్ సుధర్మరతిపై పాలింప నర్హుండ వీ-
జనసంఘంబుల కీవెనాశరణు, పూజ్యాత్ముండ వార్యుండవున్
జననాథుం డిట దండధారి: యతఁడే న్వర్గేశునాల్గంశమై
జనులన్ బ్రోచి సమస్తభోగముల స్వేచ్ఛన్ బొందు సమ్మాన్యుఁడై 9

నిరతంబున్ మమునీవ ప్రోవఁ దగు, ఈ నీదేశ మందున్న మ
మ్మరయుంగాదగు, వీటనున్నను వనంబందుండినన్ నీవె మా
నరనాథుండవు, దండమున్ విడచి యున్నామయ్య యత్యంత మీ
యరిషడ్వర్గము గెల్చియుండితిమి, మమ్మాలించి రక్షింపు మీ 10

అని వాక్రుచ్చుచు పండ్లు దుంపలును వన్యాహారముల్ పూలు రా
మునిని కర్పించుచు సత్కరించి యనలంబున్ బోలు నత్తాపసుల్
మునులున్ న్యాయపురీతి వర్తిలుచు సంపూర్ణంబుగా తృప్తితోఁ
గనుచున్ జేసిరి వారి కంతట సమగ్రంబైన మర్యాదలన్. 11

అటు లాతిథ్యముపొంది రాముఁడటనే యర్కోదయంబైన యం
తట నా మౌనుల వీడుకొల్పఁజని నానామృగాకీర్ణ ము
ర్భటశార్దూల వృకావృతంబునయి ధ్వస్తంబైన వృక్షాల ను
త్కటమై పక్షులు కీచురాళ్ళుఱచు నుగ్రారణ్య మధ్యన్గనెన్. 12

వ. అంత ఆరాముడు అచ్చట. 13

గిరి శృంగమును బోలె వఱలి యార్చుచు పురు
షుల cబట్టుకొని తినఁ దలచుచుండి
పెద్దమోము వికట విషమోదరము గల్గి
లోతైన కండ్లతో భీతి గూర్చి
వికృతమై ఘోరమౌ వేషాన రుధిరవ
సలఁ దడిసిన పులిచర్మ గట్టి

విషమమై దీర్ఘమై వికృతమై యుగ్రమౌ
నాకృతితోడ భయంబు నెఱపి

మూఁడు సింహాలు నాలుగు పులులు పదియు
లేళ్ళు రెండు తోడేళ్ళు దంతాలఁ జీల్చి
వసనుదడిసిన పెద్ద ద్వీపంపు తలను
కొఱుతఁ గుచ్చిన రాక్షసు నరసె నచట. 14

అతఁడు రాము లక్ష్మణు సీత నరసి యలిగి
ప్రజలమీఁద సంతకు డట్లు పఱచి యంత
భైరవముగ నార్చి భువి కంపంబు నొంద
వచ్చి సీత నెత్తుకు పోయి పలికె నిట్లు. 15

జడలు నారబట్టలు గట్టి శరము ధనుసు
కత్తి దాలిచి యీదండకాటవికిని
భార్యతో వచ్చి యిట్లు ప్రాణములకు
ముప్పు తెచ్చుకొంటివి బుద్ధిపూర్వకముగ. 16

మునులా మీకిటు భార్య యెందులకు పాపుల్ మీ రధర్మావ
ర్తను లౌచున్ ముని నామదూషకులుగాఁ దచ్చాడు మీరెవ్వ రీ
వని నల్గాడు విరాధుఁడన్ దనుజుఁడన్ బల్మారు చేఁబట్టి యిం
మునిమాంసాలు భుజించుచుండి సతతంబున్ జేతు సంచారముల్. 17

ఈ వరారోహ భార్యగా నెనఁగునాకు
పాపులగు మీరు నెత్తురు పట్టి పీల్తు
అని దురాత్ముఁడైన విరాధుఁ డనఁగ సీత
వాతమందు నరటివలె వణఁకి పోయె. 18

ఆ విరాధు నొడిని సీత ననఘుఁ జూచి
వాడిపోవు మోమున రాముఁ డాడె నిటుల
సౌమ్య ! జనకరాజ సుత, నాసతిని జూడు
ఆ విరాధుఁడు తనయొడి నడ్డగించె. 19

ఇదియె వాంఛించి పురినుండి యిటకుఁ గైక
కొడుకు రాజ్యంబుతోడ తృప్తి వడకె వంపె
ఇంత దీర్ఘదృష్టి గలదై యిట్లు నన్ను
అడవికంపె నామె యభీష్ట మదియు తీరె. 20

* ఎల్ల ప్రాణికి హిత మాచరించు నన్ను
కాన కంపి యాకైక సకామ యయ్యె
సీత నన్యుఁడు తాకు నీచింత ముందు
తండ్రి చావు రాజ్య భ్రష్టతయును వ్యథలె. 21

---

పాఠాంతరము :-

* ఎల్ల భూతంబులకు హితం బెపుడుచేయు
నేను నెవతెచే కాన కంపింపఁ బడితి
నట్టి పినతల్లి కైక యీయదను నందె
పూర్ణకామయై మిక్కిలి మోద మొందు.

జానకిని నన్యుఁడెవడేని స్పర్శచేయు
నంత కంటె మిక్కిలి దుఃఖ మదియె లేదు
జనకు విరహానఁ గాని రాజ్యమున భ్రష్ట
మగుటచ్చేఁగాని యింతటి వ్యథయె కాదు. 22

అని యిట్లు పలికి రాముఁడు
కనులం దశ్రువులు వెడలఁ గని లక్ష్మణుఁడున్
అనె నిట్లు క్రుద్ధుఁ డయి బు
స్సని సర్పము బుసలు కొట్టు నట్టుల నపుడున్. 23

అమరేంద్రువంటి నీవున్
సమస్త భూతములకును నాథుఁడ వయ్యున్
అమరిన యీదాసునితో
నమరి యనాథుడువలె నే నార్తిని గనెదే. 24

అలిగిన నేను శరముచే
సులువుగఁ జంప యమగృహముఁజొచ్చి విరాధుం
డిలఁగూల వాని నెత్తుటి
నేలయె త్రాగుచును తాప మెడయం జేయున్. 25

ఘనతం బగు రాజ్యము కో
రెనొ యేమొ యని భరతు పయి రెచ్చిన యల్కన్
గనఁ బఱచిన దాని విరా
ధుని పయిఁ జూపెద గిరిపయి దుశ్చ్యవనుఁ డటుల్. 26

మఱి యిక విరాధు షనమగు
నురమున భుజబలముచేత నుఱికియు శరమున్
త్వరగ నది వాని దేహము
తునుమ ధరిత్రి పయిఁబడుత తూర్ణము గాఁగన్. 27

వ. అనగా అనంతరము విరాధుఁడు వనమును ధ్వనితో నింపు మీపల్కు లను గుఱించి యడుగ నాకుఁ జెప్పుడు మీరెవ్వరు ఎక్కడకుఁ బోయెదరు అని యడుగ ప్రజ్వలించు ముఖము గల యా విరాధునితో మహాతేజుఁ డగు రాముఁ డిట్లనియెను "మేము ఇక్ష్వాకువంశస్థులము మేము క్షత్రియులము మంచి

నడత గలవారము. వనమునకు వచ్చితిమి సరే. నీవెవ్వడవో చెప్పుము. ఏల దండకారణ్యమునం జరించు చున్నావు" ఇది తెలియం గోరుచున్నాము అని యడుగ సత్యపరాక్రముం డగు రామునితో విరాధు డిట్లనియెను. 28

సరియె మంచిది చెప్పెద నెఱుగు మిపుడె
జయుని సుతుండ శతహ్రద జనని నాకు
సర్వ రాక్షసులును గూడ జగతిలోన
నను విరాధుం డటంచును ననుచు నుంద్రు. 29

ఎట్టి శస్త్రముచేత ఛేదింపం బడను
దేనికి నభేద్యుండను చావ దేనివలన
ఇట్లు నాతపంబునకును నెంతొ మెచ్చి
బ్రహ్మ నాకు వరమిడె పూర్వంబు నందె 30

కనుక నీస్త్రీయెడల నపేక్షను త్యజించి
వచ్చి నటు పర్వ్వ లిడుండు మీ బ్రదుకుం దీయ
ననంగ విని రాముం డత్యంత మలిగి యెఱ్ఱ
పడిన కండ్ల విరాధుతో పలికె నిట్లు 31

ఛీఛీ నీచుడా! హీనుండై చెలంగు నీకు
చావు మూంచుకొనుచు వచ్చె సత్య మనిని
నిన్నుం జంపెద నిలువుము నీవు నింక
జీవములతోడ పోలేవు నీవ చూతు 32

అపల ధను నెక్కు పెట్టియు నావిరాధు
నొడల-వాడియై బంగారు పిడులు గలిగి
గరుడ వాయు వేగము గల శరము లేడు
వేసి రాముండు కడు దెబ్బ తీసి కొట్టె. 33

అవ్వి సెమిలి కన్నులె బట్ట లటులు తాల్చు
నావిరాధు నెత్తుటఁ దడ్సి యవనిఁ బడియె
అతఁడు కొట్టఁగఁ బడి సీత నటనె దింపి
శూల మెత్తి లక్ష్మణు రాముఁ జొచ్చి తాకె 34

వడి విరాధుఁ డార్చుచు శకుని ధ్వజము వంటి
శూలమున వావిడిన యముఁ బోలి యుండె
అంత యముఁ బోలిన విరాధు నంగము పయి
బాణవర్షము కురిసిరి భ్రాత లపుడు. 35

ఆవిరాధుఁడు కడు నవ్వి యావరింప
నోటి నుండి చొచ్చియు మేన నుండి శరము
లంత వెడలఁగ వరముచేఁ బ్రాణ మాపి
కాని విరాధుఁడు నాభ్రాతలను నెదిర్చె. 36

అంత రాముఁడు వ్రజతుల్యంబ యైన
శూలము నఱక రెండు బాణాలు వేయు
వ్రజపూతమైన యామేరు ఫలక మట్లు
వానినుండి శూలము నేల పయిని గూలె 37

మీఁదఁ బడుచున్న రాక్షసు మేమ చూచి
వల్లఁ ద్రాచు బోలిన కత్తు లల్ల నెత్తి
బల్మిఁ గొట్టఁగ భ్రాతల పట్టి వాఁడు
వెడలఁ బరువెత్త వారు కంపింప రేమి. 38

అపుడు లక్ష్మణుతో రాముఁ డనియె వీఁడు
ఎటకుఁ దీసుక వెళ్ళునో యటకె మనము
వెళ్ళవలసిన చోటౌన్ వెళ్ళనిమ్ము
ఇదియె మనమార్గ మౌటచే నిదియ మేలు. 39

అన విరాధుఁడు బాలుర నట్లు వారి
భుజముపై నెత్తుకొని యార్చి ముందుకేగె
పక్షి మృగ భుజగ సృగాల బహుళ మగుచు
మబ్బుఁ బోలిన వనిఁ జొచ్చి బొబ్బ వెట్టె. 40

ఆ విరాధుఁడు భ్రాతల నట్లు వేగ
నెత్తుకొని పర్వులెత్త వీక్షించి సీత
ఇదిగొ సత్యశీలము లొప్పు సదయు రాము
నెత్తుకొని రాక్షసుడు పోవు నిటను గనుఁడు. 41

ఇంక నను పులుల్ తోడేళ్ళు నిట్టె మ్రింగు
వేగ రాక్షస! ననుగొని వీరి విడుము
నీకు మొక్కెద నన విని యాకరోరు
త్వరగ జంపఁగఁ బూని రాభ్రాత లపుడు. 42

వడిగ లక్ష్మణుఁడు విరాధు నెడమచేయి
పడగఁ గొట్టగ రాముఁడు కుడిది కొట్టె
అతఁడు చేతుల్ విఱుగఁ గొట్ట క్షితిని బడియె
వజ్రమున భిన్నమైన పర్వతము వోలె. 43

కాళ్ళతోడ గుప్పిళ్ళ మోకాళ్ళతోడ
రాక్షసుని తన్ని గ్రుద్ది శీఘ్రముగఁ బొడిచి
ఎత్తియెత్తియు వానిని మొత్తి మొత్తి
పుడమి బెడ్డలతోడఁ బడఁ బొడి యొనర్చె. 44

వానిఁ బలుబాణములఁ గరవాలములను
వైచి కొట్టినన్ బొడి చేసి వైవ వాఁడు
చావఁ డట్లె పర్వత మట్లు పరిగ నున్న
వానిఁ జూచి రాముఁడు భ్రాతఁ బలికె నిట్లు 45

వ. ఓ నరశ్రేష్ఠా! ఈ రాక్షసుని మనము శస్త్రముచేత యుద్ధములో బయింప శక్యముకాదు. కనుక వీనిని పాతి పెట్టెదము. ఏనుగునకువలె ఈ వన ములో ఈ రౌద్రుం డైన రాక్షసుని కొక గోతిని త్రవ్వవలయును. అని చెప్పి రాముండు విరాధుని ఆక్రమించి కాలితో ఆరాక్షసుని మెడను త్రొక్కి పట్టి నీవు వెళ్ళి లక్ష్మణా; ఒక గోయి త్రవ్వుము అనెను. అది విని ఆరాక్షసుండు రాము నితో వినయముగా నిట్లనెను. 46

"మనుజాగ్రేసర! హాహతుండ నయితిం బాకారి సంకాశు, స
జ్జను, నిన్ గుర్తింపలేదు మోహమున: కౌసల్యాసుపుత్త్రా! నినున్
జనకాధీశునిపుత్త్రి సీతను సుధుమశ్శాలిన్ సుమిత్రాసుతున్
గని యీనాం డిట గుర్తింపన్ గలిగితిన్ నాభాగ్యముల్ పండెంగా 47

తుంబురుం డనుగంధర్వుం డన్ తొల్లి నేను
ఆకుబేరుని శాపాన నసుర నగుచు
నతని బ్రతిమాలు కొన నాతం డనియె నిట్లు
సంగరంబున రాముండు చంపు నిన్ను 48

అప్పుడు నీచూపు గని స్వర్గ మందం గలవు
అనుచు రంభయం దాసక్తి నతని సేవ
యందు పొరపాటు పడు నన్నటు శపించె
నీదయను శాప మోక్షంబు నేను గంటి! 49

నీకు శుభమౌత! స్వర్గమున్ నేను పోదు
నిటనె యామడన్నర దూర మేగివంత
సూర్య సముండై ప్రతాపమున్ జూపు వాండు
అనఘుండు శరభంగుం డను మహర్షి కలండు. 50

అతఁడు ధర్మాత్ముఁ డిపుడు శ్రేయస్సు నీకుఁ
గూర్చు వేగ నాతని గనుంగొనుము రామ!
గోతిలోపల నన్నును గూలఁజేసి
పూడ్చి పెట్టి క్షేమంబును పొందు మయ్య. 51

మృతు లయిన రాక్షసులకు నిదె సనాత
నమగు ధర్మము, గోతిలోనఁ బడ వైచి
పూడ్చఁ బడు వారు ప్రాచీన భువనములకు
పోదు రని శరవ్యథఁ జనిపోవ నుండె, 52

వ. అపుడు రాముఁడు లక్ష్మణునితో "లక్ష్మణా! ఏనుఁగునకు వలె ఈ రాక్షసునికి ఒకగోయి త్రవ్వు"మని చెప్పి విరాధుని కంఠమున పాద ముంచి యుండ లక్ష్మణుఁడు గునపము తీసికొనివిరాధునికె దగ్గరగనె గోయిత్రవ్వెను ఆవిరాధుని కంఠమును విడచి అతని ముద్దగా మర్దించి శంకువులు వంటిచెవులు గల యావిరాధుడు భీకరముగ అర్చుచుండఁగనె రాముఁడు లక్ష్మణుని తోఁ గలిసి ఆభూమి బిలమందు ఁబడవై చిరి. ఆవిరాధుఁడు శస్త్రములచేఁ జంపఁబడని వాఁడు గాన వానిని అట్లు గోతిలోఁ బడవై చి ఆవిరాధుఁడు తన వధను గూర్చి చెప్పి నట్లుగా పూడ్చి పెట్టెను. అపు డావిరాధుని గోతిలోఁ బడవైచు చుండ అవిరాధుని యార్పుల చేత ఆవన మంతయు మారు మ్రోగిపోయెను. అట్లు బంగారు వంటి చిత్రధనుస్సులు గల రామలక్ష్మణులు రాళ్ళతోఆగోతినిపూడ్చిరి అంత రాముఁడు సంతోషముతో సీతను గ్రహించి కౌగిలించుకొని యోదార్చెను. పిదప ఆకాశమున సూర్యచంద్రులవలె మహావనమున విహరించుచుండ. దీప్తతేజసుఁడైన లక్ష్మణుని జూచి రాముఁడిట్లనియె. 53

ఈ వనము దుర్గమము మన మెప్పుడిట్టి
వనుల నున్న వారముకాము కనుక నిదియు
నెంతొ కష్టంబు శరభంగ ఋషిని గనుద
మనుచు నతఁ డేగె శరభంగు నాశ్రమంబు. 54

అట్టుల తపస్సుచే భావితాత్ముఁ డౌచు
దైవ బల మున్న శరభంగు దరికి నేగి
అచట సూర్యాగ్ని తుల్యమై యుంగ కాంతిఁ
వనపు నొక మహద్భుతాకృతుఁ గనియె నచట. 55

రథమునుండియు దిగి బుధులు వెంటాడఁగ
పుడమి స్పృశింపక నడచు వాని
ప్రభఁ జిమ్ము నగలు నిర్మల వస్త్రము దాల్చి
యుల మహాత్ములఁ గొల్వ నలరువాని
ఆకు పచ్చని మేలి యశ్వాలతో మింట
రవిఁ బోల్ రథము దరిఁ గ్రాలువాని
తెల్లని మేఘముబ్బ తెలి చంద్రబింబాల
వడువున ప్రజ మొప్పు గొడుగువాని

పసిడి పిడు లొప్పు చామర వ్యజనములను
దాల్చి కాంతలు వీచఁగఁ దనరు వాని
సురలచే మహర్షులచేత సుతుల నొందు
నమరపతి నింద్రు రాముఁడు నరసె నపుడు, 56

అంతరిక్షాన శరభంగుఁ డమర పతియు
మాటలాడుచుండఁగ నట్లు మహితుఁ డైన
రాముఁ డారసి చెప్పాడు లక్ష్మణునికి
నింద్రు రథమును జూపించి యిట్టు లనియె, 57

అర్చిసులు గల్గి సిరి నొప్పి యద్భుత మయి
మిహిరువలె ప్రకాశించుచు మింటి నున్న
రథముఁ జూడు లక్ష్మణ ! మింట బ్రజలు నింద్రు
వశ్వములివి, ధ్రువము వింటి మట్లు మున్నె. 58

వారు వ్యాఘ్రములవోలె నప్రాప్య గతులు
వారి బాహులు పరిఘలవలెఁ దనర్చు
ఎఱ్ఱని వలువల్ హారాల నెసఁగినారు
వారి వయసిరువది యైదె, వహ్నిసములు. ౩౯

ఇదియె దేవుల వయసింతె. యెపుడు వారు
ప్రియ మయిన దర్శనము గల్గి ప్రీతి నుంద్రు
ఈవు లక్ష్మణ ! సీతతో నిటనె యుండు
రథము దరి నున్న ఘనుఁ జూచి రయమవత్తు. ౪౦

అనుచు శరభంగు నాశ్రమంబునకు వచ్చు
రాముఁ గని శరభంగుతో నామహేంద్రు
డనియె ఈరాము డిట వచ్చు నంతలోనె
నను దివము పంపుఁ డవల నన్ గనఁగవచ్చు. ౪౧

అనుచు నింద్రుఁడు మునినిఁ వీడ్కొని భజించి
అశ్వములఁ బూన్చి రథమెక్కి యరిగె దివికి;
ఇంద్రు డరుగ రాముఁడు తమ్ముఁ డింతి రాఁగ
అగ్నిప్రవేల్చెడి శరభంగు నరసి మ్రొక్కె. ౪౨

వారలమ్ముని యనుమతిన్ గూరుచుండ
సత్కృతుల నంది రాముఁడు శక్రు రాక
గూర్చి ముని నడుగ శరభంగుడు నిటుల
నింద్రుఁ డెందుకు వచ్చెనో యెఱుఁగఁ జెప్పె. ౪౩

రామ ! యీమహేంద్రుండు వరంబులీయ
వచ్చి చంచలాత్ములు చేరవలను గాని
బ్రహ్మలోకంబు నన్ను జేర్పంగ వచ్చె
నాదగు తపంబును స్వాంతమున మెచ్చి. ౪౪

నరవరా ! నీవు దరినుండ నెఱిఁగి నిన్ను
నిష్టమైన యతిథిని వీక్షింప కుండ
బ్రహ్మలోకంబునకు నేనువేగ రామ ! నిన్ను
దర్శనము మహాత్ముఁ గని పోవఁ దలఁచినాను. 65

నరవరా ! యక్షయంబులు నాక పృష్ఠ
ములును బ్రాహ్మ్యములౌ లోకములను నేను
పొందినాఁడ వానిని నీవు పొందు మనఁగ
నేనె యా లోకములఁ గాంతు నివ్వి వలదు. 66

నీవు ననుమతి నీవని నేను నుందు
ననుమతింపుమి యని రాముఁ డన, ముని యనె
రామ ! యిట సుతీక్ష్ణుఁడను ధర్మాత్ముఁ డిపుడె
యుండె నతఁడు నీకును శ్రేయ మొనరఁజేయు. 67

అతని పొందు మాతఁడు నీకు నమలమైన
యంద మైన చోటున వాస మమరఁ జేయు
ఈనదిని బట్టి పొమ్మిది యిట్టె పూవు
కాన్క బడవఁ దేల్చు పటపట నలరఁ జనుమి 68

ఇదియె మార్గము నరవర! యిటులఁ జూడు
పాము కుబుసమువలె మేను వదలు చుంటి
అనుచు నప్పు డగ్నిని బ్రేల్చి యాజ్య ముంచి
వహ్నిఁ జొచ్చె మాంత్రికుఁడు శరభంగ ఋషియు 69

ఆమహాత్ముని రోమంబు లతని జుట్టు
శుష్క చర్మాస్థి మాంసముల్ శోణితమును
అగ్ని దహియించె, నట్టి దృశ్యంబు చూచి
సీతరామలక్ష్మణులు వచ్చెరువడిరి, 70

పిదపను శరభంగ మహర్షి వీతిహోత్రు
నుండి పావకునివలెఁ గుమారుండె యగుచు
వెలిఁగి యాహితాగ్నులు మహాత్ము లగు ఋషుల
లోక మమరలోకము బ్రహ్మలోక మొందె 71

అమ్ముని వరుండు బ్రహ్మలోకమ్ము నందు
సానుచరుని పితామహు నప్పు డరసె;
ఆ పితామహుఁ డాద్విజు నరసి మిగుల
ముదము పొంది సుస్వాగతమును వచించె 72

అట్లు శరభంగ ఋషి స్వర్గ మరిగి నంత
ప్రజ్వలించు తేజము గల రాము దరికి
అచట నున్నట్టి ముని గణం బాదరమున
వచ్చి చుట్టు కూర్చుండిరి ప్రకట రీతి. 73

భగవంతు నఖరోమ భాగాల వెడలిన
వైఖానసులు మ వాలఖిల్యు
లాప్రజాపతి చరణంబుల వెడలు సం
ప్రక్షాళు. లంశులఁ ద్రావువారు
ఱాళ్లు కొట్టియుఁ దిను ప్రథితులు పత్రముల్
తిను వారు, కొఱఁకుచు తినెడివారు
మెడదాక గలనీళ్లఁ గడు తపము సలుపు
వారు, స్వగాత్రాలఁ బండువారు 74

పండుకొనని వారలు, నొంటిపాద మందె
నిలుచు వారలు, వాయు భక్షులును, వారి
భక్షులును, నావరణ లేక వరలువారు
కటిక నేలఁ బండెడి వారు నటను గలరు 75

వృక్ష శాఖలఁ బర్వత శృంగములను
తపము చేయువారు తడి వస్త్రంబె గట్టు
వారు, పంచాగ్ని మధ్య తపంబు చేయు
వారు జపించువారు తాపసులు గలరు. 76

ఇట్లె బ్రహ్మవర్చసు గల్గి యెంతొ శుద్ధ
యోగ మొందిన వారలు యోగ సాధ
కులును నైన తాపసులును నెలమి వచ్చి
అట్టి శరభంగు నాశ్రమ మందు మంద్రు. 77

ధర్మ విదులైన వీర లందఱును గూడ
ఆ మహాధర్ముఁ డగు రాము నరసి యనిరి
"నీవా యిక్ష్వాకుకులమునకు కీ వసుధకు
ప్రముఖుఁడవు విభుండవు వజ్రి యమరులకటు 78

విశ్వములు మూఁటఁ గీర్తిచే విక్రమమున
ఖ్యాతుఁడవు, పితృభక్తి సత్యంపు నిష్ఠ
ధర్మమును నీయెడలను నత్యంత ముండె
అర్థుల మయి మేము పచించు వది క్షమింపు 79

పన్నుగా షష్ఠభాగంబు పడని యెవఁడు
సుతులవలెఁ బ్రజఁ బ్రోవఁ డాక్షోణి పతియొ
నాయన ! కడు నధర్మమున్ బడసి యిందు
పాపమును బొందు చుండు నేపగది నైన 80

ప్రాణములకంటె నిష్టమౌ సూను లట్లు
తనదు ప్రాణా లటు స్వదేశ జనుల నెవఁడు
శ్రద్ధతోఁ బ్రోచు, వాఁడెప్డుశాశ్వతమగు
యశముగని, బ్రహ్మ పదమంది యధికుఁ డగును. 81

ధర్మమునఁ బ్రజలను బ్రోచు ధరణి విభుఁడు
పండ్లుదుంపలు తిను మౌని వరుఁడు పొందు
పరమధర్మాన నాల్గవ భాగమెపుడు
పొందుచుండు నటంచును పుత్ర! యెఱుఁగు 32

బ్రాహ్మణులె యెక్కువగ నిందు వఱలుచున్న
యెట్టి గొప్ప వానప్రస్థు లెల్లఁ గూడ
నీవు నాథుఁడుగాఁ గల్గి నెగడి కూడ
చంపఁబడి రనాథులటు రాక్షసుల చేత. 33

ఇదిగొ పంప మందాకి నదులదరిని
చిత్రకూటమందు వసించి స్థిరతమీఱ
ఆత్మ భావించుమునుల దేహములు చూడు
ఘోర రాక్షసు లెటు చంపిగుట్ట లిడిరి. 34

క్రౌర్యకర్మలు కలుగు రాక్షసులు నను లఁ
జలుపు మౌని మారణ హోమములను నింక
సైపలేక శరణు నిచ్చు క్ష్మాపు నిన్ను
శరణు జొచ్చితి, మేము రాక్షసుల నుండి. 35

వ. వీర! పృథివియందు నీకంటె నింక వేఱు గతి మాకులేదు. రాకుమార నీవు మమ్ము రాక్షసుల నుండి రక్షింపుము అని తాపసులు పలుకు వాక్యము లాలించి ధర్మాత్ముఁడైన రాముఁ డాతపసు లందఱితో నిట్లనెను. ఓమహాత్ము లారా మీ రిట్లు పలుకుట తగదు. మీకు నేను ఆజ్ఞాపింపఁ దగినవాఁడను నేను కేవలము నాపనికై యడవికి రాఁదగి యుండెను. మీకు రాక్షసులవలనఁ గల్గిన కష్టమును గూడ తొలగింపవలసి యుండెను. నేను తండ్రి యాజ్ఞచే వనము ప్రవేశించితిని మీ కార్యము నెఱవేర్చుట కూడ అనుకొనకుండనె యయినది. నా కీవనవాసము మహాఫలకారి యయినది. యుద్ధములో మీశత్రువులైన

రాక్షసులను జంపినపై తుసు మాయిద్దఱు సోదరుల పరాక్రమమును శీఘ్రె చూచెదరుగాక" అని ధీరాత్ముడైన రాముఁడు లక్ష్మణునితో పాటు ఆ మునులకు వరమిచ్చి ఆర్యవృత్తము గలవాఁడై తపోధనులతోఁ గూడ సుతీక్ష్ణుని ఆశ్రమమునకు సీతతో రామలక్ష్మణునితో గూడి బయలుదేఱి దగ్గఱగ నున్న పుష్కల జలములు గల నదులను దాటి వెడలి మహామేఘమువలె ఉన్నతమైన విమల శైలము నొకదానిని జూచెను. 86

## —: సుతీక్ష్ణునిఁ జూచుట :—

ఒడల ధూళియు మట్టియు నడర, జడలు
దాల్చి కూరుచున్న సుతీక్ష్ణుఁ దపసివృద్ధుఁ
దగినరీతి సమీపించి దాశరథియు
వినయ సంభ్రమంబులతోడ ననియె నిట్లు. 87

నేను రాముఁడ భగవంత! నిన్ను నేను
జూడ నీయాశ్రమమ్ముఁ జొచ్చినాఁడ
ఓయి ధర్మజ్ఞ! సత్యప్రయోగ నిపుణ
ఋషివరా! యభిముఖుఁడవై యిటు వచింపు. 88

అన, సుతీక్ష్ణుఁడు ధర్మాత్ముఁడైన రాముఁ
గాంచి గ్రుచ్చి బాహులఁ గౌగిలించుకొనుచు
పలికె వీర! రామా! నీకు స్వాగతంబు
ఆశ్రమముఁ జొచ్చుట సనాథమయ్యె నేఁడు. 89

ఎపుడు వత్తువో యని నిరీక్షించుచుండి
ఈధరణిపైని మేను త్యజించి వైచి
యిచట నుండి స్వర్గ మధిరోహింప కుంటి
ఓయశశ్శాలి! నిను జూడ నుత్సహించి. 90

'నీవు రాజ్యంబునుండి గెం [illegible]
వనుచుఁ జిత్రకూటము వచ్చి [illegible] వెంటి
రామ! సురపతి వచ్చి సప్పింపు బగవు
'లేను పుణ్యకర్మను గెల్చినాను ననిచె. 91

తపనుచే నేను పొందిన తజ్జగాలు
దేవ ఋషులు శ్లాఘింతురు, దివ్యమవ్వి
నాయనుగ్రహంబున నీవు పోయి యుటకు
ఇంతి సౌమిత్రి రా విహరింపపోయి. 92

ఆ తపస్వి యగు సుతీక్ష్ణుఁ డాడినట్టి
నుడుల విని యాత్మయుతుఁడు రాముఁడు వచించె
బ్రహ్మతోఁ గాశ్యపుఁ డటు; నే స్వయముగానె
లోకములను పొందంగ గల్గుదు మునీశ! 93

ఈవనంబున నెచట వసింప నగునొ
తెలుపఁ గోరెద నీవెల్లఁ దెలియు ఘనుఁడ
వఖిల భూతాల దయగల యనఘుఁ డీవు
ఇట్లు శరభంగ గౌతముఁ డెఱుఁగ దెలిపె. 94

అని రాముం డన లోకమందుఁ బ్రథితుండౌ నామహామౌనియున్
మనమందున్ ముద మొంది యాదరమునన్ వాక్రుచ్చె నోరామ! పా
వన మీయాశ్రమమే మనోహరను శుభ్రంబై మహర్షి వ్రజం
బున నొప్పారెడి. నిందు దుంపలు ఫలంబుల్ పుష్కలం బయ్యెడన్. 95

మృగ సంఘా లిట కేగుదెంచు మన కేమీ హాని గావింప పం
తగఁ గానీ మది లోభపెట్టు భయ మింతైనన్ మదిం బొందవీ
మృగ సంఘంబులవల్ల నింతకును మించేమాత్ర దోషంబు గాం
చఁగ లేదంచు మహర్షి పల్క ధనువున్ సారించి రాముఁ డనెన్. 96

ఓ మహానుభావా ! యిందు నేమి కష్ట
మిటకు వచ్చిన మృగముల నిట్టి కూల్చుఁ
గాని యిందు మీకును బాధ యౌను గాన
కరము కష్టమె యిది, కానఁ జిరము నిలువ. 97

వ. అని రాముఁడు పలికి సాయం సంధ్య నుపాసించి సీతతోను, లక్ష్మ
ణునితోను అట వసింప ఆ సుతీక్ష్ణుఁడు సంధ్య గడచి రాత్రి వచ్చుట చూచి
యాసోదరులకు సీతకును స్వయముగ తాపసులు భుజించెడి యాహారమును
సత్కార పూర్వకముగ నర్పించెను. 98

ఆ సుతీక్ష్ణుఁ డనుజుల నర్చన మొనర్ప
వారు నట రాత్రి గడవఁ బ్రభాత వేళ
సీతతో రాముఁడంత లేచియు సుశీత
మై కలువ తావి గల నీరు నాచమించె. 99

సీత రామలక్ష్మణులను వీతిహోత్రు
సురలను తపోవనంబున సరిగఁ గొల్చి
ఉదయ మొందిన రవిఁ జూచి వదలి పాప
మా సుతీక్ష్ణుని దరిఁ జేరి యనిరి ప్రీతి. 100

ఓ మహాత్మ ! పూజ్యుఁ డగు నీవాగి భజింప
రాత్రి సుఖముంటి మిట, మునుల్ త్వర యొనర్తురి
మాకు సెలవిచ్చి పంపుము మాన్యశీలు
లయిన ఋషుల యాశ్రమ మండలంబు నరయ. 101

శిఖలు లేని యగ్నులువోలెఁ జెలఁగుచుండి
ధర్మనిత్యులై తపసుచే దాంతు లగుచు
వటులు నీవర మునులతో భవదనుజ్ఞ
పొంద గోరుచు నుంటిమి పూజనీయ ! 102

అపమార్గమ్మున శ్రీ గను
నుపకార రహితుఁడు వోలె నూర్ధ్వపు గతికిన్
తపనుఁడు వడి రాకుండెడి
నప్పుడె చన వలె నని మ్రొక్కె రందఱు మునికిన్, 103

చరణంబుల వ్రాలిన వో
దరుల వయికి లేవ దీసి తవసివరుండా
దరమునఁ గవుఁగలించుకొ
ని, రాముఁ జూచి యిటు చెప్పె నెయ్యముతోడన్. 104

రామా ! లక్ష్మణుతోడను
నేమఱకయె నీడవోలె నేతెంచిన యీ
ప్రేమమయి సీతతోడను,
క్షేమముగా నేగు మోయి శ్రేయః పథికిన్. 105

తపసుల నాత్మను భావిం
చు పావనులు దండకవనిఁ జొచ్చి వసింపన్
ఎప్పుడును పుణ్యంబయి ర
మ్యపు దృశ్యములఁ దగు నాశ్రమం బిది కనుమీ. 106

అలరుల నొడలెల్లఁ బులకింతో వనములు
పండ్లు దుంపలతోడ నిండియుండు

మృగయూథములు వంచరించుచు నుండఁగం
బక్షి గణంబులు మౌనముూచు

విచ్చు తామర పూలు మెచ్చి నవ్వులు చిమ్మ
సరసుల జలము ప్రసన్న మగును

హంసలు విహరించి యందాలు నింపఁగ
నెమిళులు కేకల నేర్చు చూపు

కొండ కాల్వలు కనులకు గొనబు గూర్చు
కడు సరణ్యాల దృశ్యాలు క్రమ మగును
వత్స ! సౌమిత్రి ! నీవును బయలుదేఱు
ఆశ్రమము చూచి మరల నీవరుగుదెమ్ము. 107

అపుడు రామలక్ష్మణులును నమ్మునికిని
భక్తిని ప్రదక్షిణము నేసి బయలుదేఱ
పొడుగు కండ్ల సీతయు విండ్లువడిగ్రమోగ
అంబుపొదులు కత్తులు కట్టి యంది యిచ్చె, 108

వ. అట్లు సుతీక్ష్ణుడు అనుమతించి పంపఁగా బయలుదేఱిన రామునిజూచి తీయని స్వరముతో తన పతిని జూచి సీత యిట్లనెను. 109

—: రాక్షసులతో పగవలదని సీత చెప్పుట :—

సూక్ష్మముగను విచారించి చూడ నిందు
చాల గొప్ప యధర్మము సంభవించు
కామమునఁ బట్టు వ్యసన సంగతుల నుండి
మరలి నట్టి నీకిదియె దుష్కరము కాదు. 110

కామమునఁ బుట్టు వ్యసనాలు కలవు మూఁడె
అనృత మొక్కటి, గురుతరా, లవలి రెండు
అన్య పతి వాంఛ, పగ లేక యలుక గనుట;
అనృత మిది వఱకాడ లే దాడఁ బోవు. 111

ధర్మనాశక మగు పరదార వాంఛ
ఎట్లు నీకగు, లేదు నీకిది వణికుసు
మనసులోఁ గూడ నీకిది మసల దెపుడు
రాజపుత్రి ! నీవు స్వదార రతుఁడ వెందు. 112

జనక వాక్య కారివి సత్యసంధుఁడవును
ధర్మరతుఁడవు, నీయందు ధర్మనిష్ఠ
సత్యమును గల్గు, నీయందు సర్వ ముండె
ఇవి పరులకు శక్యంబు జితేంద్రియుఁడవు. 113

ప్రాణులకు హింస గూర్చెడి యలుక నీకు
పగయె లేకుండ మోహాన ప్రాప్త మయ్యె
దండకారణ్య తాపస తతులతోడ
ఋషులఁ గావ రాక్షసుల వధింతు నంటి. 114

ఇట్లు వెడలిన నిన్నుఁ జూచి యెడఁద కుందు
నీనడత యెంచ నాకిటన్ మేలె కలుగు
దండకారణ్య మేగ నామతంబు కాదు
ఇందు హేతువు చెప్పెద నిపుడె వినుము. 115

బాణములు ధనుస్సును దాల్చి భ్రాతతోడ
వనమునకు నీవు నియతిమై వచ్చినావు
సర్వ వనచరులను గాంచి శరములకును
ఇంక గురిఁ జేసి కొట్ట వాంఛింతు విపుడు. 116

క్షత్రియులకు ధనుస్సు దగ్గఱగ నున్న
అగ్నిహోత్రంబునకుఁ గట్టె లంటియున్న
వారి వారి తేజస్సుల బలము నవ్వి
హెచ్చుచేసి యెల్ల యెడ వ్యాపింపఁ జేయు. 117

వినుము మహాబాహు ! మృగ పక్షులును జరించు
నొక్క వని, శుచియై సత్యవాక్కు వగుచు
తపసి యొకడుండె, నాతఁడు తపముచేసె
వాని తపము పాడొనరింప వజ్రి తలఁచె. 118

భటుని రూపముతో నింద్రుఁ డటుల వచ్చి
పుణ్యతపము గావించెడి మునికి నపుడు
ఒక్క కత్తి దాచమనుచు నొసఁగి చనఁగ
మునియు ఖడ్గమును శ్రద్ధఁ గనుచు నుండె. 119

ఎపుడు వనికేగుచును సంచరించు, నపుడు
పండ్లు దుంపలు తెచ్చెడి పట్టులందు
దాచ మనుచు నిచ్చిన కత్తి తనకు దరినె
యుంచు, నది యెపుడు వదలకుండ నుండు. 120

కత్తి నెప్పుడు ధరియించి క్రమము మీఱ
తపసునందు నిశ్చయబుద్ధి తప్పిపోవ
రౌద్ర బుద్ధి పూనియె యధర్మమునఁ జిక్కి
కత్తి సంబంధమున నరకంబు పొందె. 121

ఇది యిటుల కత్తి సంబంధ మెనసి మున్ను
జరగె నగ్ని సంబంధము కరణిఁ గత్తి
కూడ హేతువౌ, స్నేహాన గురుతవలన
జ్ఞాపకముచేతు నిది బోధ కాదునుమ్ము. 122

ధనుసు పూని దండకారణ్యమున వసించు
రాక్షసులఁ జంపరాదు వైరంబె లేక
యేవిధముగను; తప్పు గావింప నట్టి
జనులఁ జంపుట కే చెప్పు సమ్మతింప. 123

వనములను నియతాత్ములై వరలుచుండి
వీర వరులైన క్షత్రియుల్ వింటి చేత
చేయఁ దగునట్టి కార్యము యేయుదనఁగ
ఆర్తులగు వారి రక్షణ మన్న దొకటె. 124

శస్త్ర మెక్కడ, నెక్కడ శాంతవనము
క్షాత్ర మెక్కడ తపము లెక్కడ గ్రహింపు
ఇవి పరస్పరము విరుద్ధవృత్తి గలవి
శాంత వనదేశ ధర్మమె సలుపు మయ్య. 125

ఆయుధమ్ముల సేవించి నందువల్ల
కృపణులకుఁ బోలె బుద్ధి జనించుఁ జుమ్మి
వనమునుండి యయోధ్యకుఁ జనియు మరల
క్షాత్ర ధర్మము చరియింపఁ గలవు లెమ్ము. 126

సకల సామ్రాజ్య భోగముల్ సరగ విడచి
నీవు మునుల వ్రతంబు వహింతు వేని
అపుడు నాయుత్త మామ లత్యంత మైన
పరమమానంద మొంది యుందురు ధ్రువంబు. 127

ధర్మకార్యమువల్ల నర్థంబుగలుగు
ధర్మ మాచరించుటవల్లఁ దనరు సుఖము
ధర్మమున సమస్తమును సిద్ధంబె యగును
ధర్మసారమె యీసమస్తము జగంబు. 128

మన శరీర మాయా నియమములచేత
ఎంతొ యత్నించి కడుఁ గృశియింపఁ జేయ
పరమ ధర్మము మనకు సంప్రాప్త మగును
సుఖమువల్లను దొరకవు సుఖము లెపుడు. 129

సౌమ్య ! శుద్ధమతి వయు యుధ్రకాంత మీవు
అరసి యాతపోవన ధర్మ మాచరింపు
ఈ త్రిలోక వృత్తాంతము లెల్ల సరిగ
నీకు తెలియనియవి కావు నిపుణమతివి. 130

స్త్రీ స్వభావ చాపల్యానఁ జెప్పి తిటులు
నీకు ధర్మము చెప్పఁగా నేర్చు నెవఁడు
భ్రాతతోడఁ గూడ మతి విచారణ యొనర్చి
త్వన్మతికి నచ్చునటు చేయు తడవు వలదు. 1 1

—: రాముఁడు ఆర్తులగు మునుల రక్షింతు ననుట :—

స్నేహమున నాకులముఁ దెల్పి నీవు దేవి!
జానకీ! ధర్మవిదురాల! సరిగ హితము
చెప్పితివి సరె మంచిది, తిన్నగాను
నేను చెప్పెడి సంగతిన్ వినుము కూడ. 132

ఆర్త శబ్దమె యుండరా దనుచు నెపుడు
క్షత్రియులు విల్లు ధరియింత్రు గాదె యంటి
సీత! దండకాటవి వ్రతశీలమునులు
నార్తులై వచ్చి నను శరణందినారు. 1:3

ఎల్ల కాలము దుంపలు పళ్ళు తినుచు
నసురులకు భీతిలియు సుఖ మంద రెపుడు
వనుల నెప్పుడు నియమాలఁ దనరు మునుల
మనుజ మాంస జీవు లసురుల్ తినుచు నుంద్రు. 1.4

దండ కారణ్యవాసులౌ తపసు లెల్ల
రాక్షసులచేతఁ దినఁబడి రక్షలేక
నను శరణుఁ జొచ్చి రక్షింప మనిరి వారి
మాట విని వారి కుందిటు మాట యంటి. 135

"మీరనుగ్రహింపుడి యిటు మీరు నన్ను
చేరి కోర నాకెంతయున్ సిగ్గుచేటు
నన్ను నేమి పలుపమందు రన్న, వార
లందఱును నన్నుఁ జేరి యిట్లనిరి యపుడు. 136

"దండ కారణ్య వాసులౌ తాపసులము
కామ రూపులౌ పెక్కు రాక్షసులచేత
చంపఁబడు చుంటి మయ్య నిష్కారణముగ
నీవిపుడు మమ్ము కరుణ రక్షింప వోయి. 137

మాంసమును తిను రాక్షసుల్ మమ్మెదిర్చి
హోమములవేళ పర్వాల నుతికి పడుదు
రట్టి వారి నుండియుఁ బ్రోచు నట్టి వార
లెవరౌ యని వెదకఁగ గతి వీవె యయితి. 138

స్వయముగా మేము తపః ప్రభావ గరిమ
రాక్షసుల నులువుగ నిటుల్ చంపఁగలము
అయినను జిరకాలమునుండి యార్జిత మగు
ఈతపము కర్చుపెట్టుట కిష్టపడము, 139

తపము బహువిఘ్న మౌచు నిత్యంబు చేయఁ
జాల నిది కాన రామః రాక్షసులచేతఁ
జంపి తినఁబడుచుండియు శాపములను
వారిపై విడువక సైచ వఁసి వచ్చె. 140

చండ కాటముఁ గలుగు దైత్యాళిచేత
నెంతొ బాధపడుదుము రక్షింపు మయ్య
వనిని మీసోదరులె మాకుఁ బరము గతియుఁ
అనుచు వారు ప్రార్థింపఁగ నట్లె యంటి. 141

తీర కావఁగఁ బూర్ణప్రతిజ్ఞ చేసి
జీవముల నుండి మునులకుఁ జేసినట్టి
యుష్ట మైనయట్టి ప్రతిజ్ఞ యెట్లు నేను
చేయకుండ నుండుదుఁ జెప్పుసీత! నీవె. 142

ప్రాణముల నైన నిన్నైన ననుజ నైన
విడతుఁ గాని విశేషించి ద్విజుల కిట్లు
చేసిన ప్రతిజ్ఞ నెట్లు త్యజింపఁగలను
కాన తప్పక ఋషుల రక్షణము చేతు. 143

చేరి యసలిది వారలు కోరకుండ
చేయవలసిన పనియు; విశేషించి వారు
కోరఁగఁ బ్రతిజ్ఞ చేసియు నూరకుండు
టెట్లు జానకి! యిదియు వచింప వలెనె. 144

నీవు సౌహార్దముననుఁ నాస్నేహముననుఁ
నిట్లు చెప్పితివి యనఘ! యిందు నేను
మిగులఁ బరితుష్టిఁ బొందితి మేదిని నిట
నెవరు చెప్పరు గాదె యనిష్టులకును. 145

నీదు గొప్పకులమునకు నీకుఁ గూడ
నిదియె యనురూపమై తగినదియ సుమ్ము.
నీవు నాప్రాణములకంటె నెంతొ గొప్ప
దానవును నింక నానహధర్మ చరివి" 146

ఆని యిటు మహాత్ముడౌ రాముఁ డనుఁగు ప్రియకు
మిథిల రాజపుత్త్రి కని సౌమిత్రితోడ
ధనుసు ధరియించి రమ్యమౌ స్థలము లొప్పు
నాతపోవనముల నెల్ల నరయనరిగె. 147

మొదటన్ రాముం డేగెను
పిదపన్ జానకియు నేగెఁ బిదప ధనుస్సున్
పదిలముగఁ బూని లక్ష్మణుఁ
డదనున నటు నిటులఁ గనుచు నరిగెను వనిలో 148

నానా ప్రదేశాల నగముల నలుప్రక్క
రమ్య మైనట్టి యరణ్యభువుల
చఱియల జలజల జాల్వాఱి పాఱెడి
సెలయేళ్ళ శుద్ధమై యులరు నదుల
ఇసుక తిన్నెల విహరించెడి బెగ్గురు
పక్షులఁ జక్కవ పక్షిగముల
కిలకిలలాడెడి జలవిహంగములను
విలసిల్లు పద్మాల కొలను సొరు

మనలు లేళ్ళ గుంపు మదించు మహిషములను
అడవి పందుల చెట్టుల నడఁచు కరులఁ
గనుచు దవ్వేగి వార లర్కాస్తమయము
తఱిని యోజన దీర్ఘమౌ సరసు గనిరి, 149

కలహంసంబులు సారసంబులును నిక్వాణంబు గావింపఁగన్
జలజంతుల్ విహరింప పద్మములు భాసల్ చిమ్మగా శుద్ధమౌ
జలముల్ గల్గిన యాసరోవరమునన్ శ్రావ్యంపు వాద్రిత్ర గీ
త లసద్ఘోష మొకండు వీనులకు విందై వింత చేకూరిచెన్. 150

వ. అపుడు రామలక్ష్మణులు తమతో వచ్చిన ధర్మభృతుం డను మునిని జూచి యి ట్లడిగిరి. ఓ మహామునీ! ఈ యద్భుత మైన గీతవాదిత్ర ఘోషము వినఁగా మా కాశ్చర్యము కలిగినది. ఇది యేమి చక్కఁగాఁ జెప్పఁ దని యడుగ ఆముని ఆసరస్సు పుట్టుకను గూర్చి యిట్లు చెప్పెను. 151

ఇది పంచాప్సర మనుసర
సిది తపసున మాండకర్ణి ఋషి నిర్మించెన్
పది వేలేం డ్లతఁడు గా
లిఁదిని జలమున నిలిచి యొనరించెను తపస్సున్. 152

అప్పు డగ్నిలో నగుదేవు లార్తిఁ జెంది
ఒకరి నొకరు కల్సికొని చెప్పుకొని రిట్లు
ఈ మునీంద్రుఁడు మన పదంబెదియొ కోరి
తపసు చేయుచు మన్నాఁడు తడయరాదు, 153

అనుచు దేవత లందఱు వ్యథను చెంది
మెఱుపు లటు మిలమిల లాడి మెఱయుచున్న
ప్రథితలౌ నైదుగురు నప్సరసలఁ బంప
వీరు మునినిగా మవశుఁ గావించినారు. 154

సురలపనికి నయిదుగు రప్సరస లపుడు
మునికి భార్యలు కాఁగ, నామునియు వారి
కీసరస్సున నొక్క యదృశ్య గృహముఁ
దీర్చ వార లిటు సుఖాలఁ దేలుచుండ్రు. 155

ముని తపః ప్రభావాన యౌవనము పొంద
వాని సంతోషపెట్టి రప్సరస లపుడు
తేలి క్రీడించు వారి వాదిత్ర నాద
మెంతొ భూషల ధ్వనిఁ గల్పి యింపు నింపు". 156

అత్మ భావించు రాముని యనఁగ నిటు
ఇష్ట్యదెంత వింత యని గ్రహించి రాముఁ
డనుజుతో నని బ్రహ్మోజముఁ దనర్చి
వల్కలము లొప్పు నాశ్రమ వ్రజము గనెను. 157

* వ. పిదప నారాముఁడు పత్నితోను తమ్మునితోను గూడి శుభమైన యాయాశ్రమ మండలమున మహర్షులు గౌరవింపఁ గొంత కాలముండి పిదప క్రమముగా నిదివఱకు వెళ్ళియున్న యాశ్రమములందు ఉండెను. ఇట్లు ఆ మహాస్త్రసంపన్నుఁడగు రాముండు ఒకచోట ఇరువదిరెండు నెలలు, ఒకచోట పదునాలుగు నెలలు ఒకచోట పదునైదు నెలలు ఒకచోట పదునాఱునెలలు ఒకచోట పదియున్నర మాసములు ఒకచోట పదునొకండున్నర నెలలు ఒక ఒకచోట పదమూడునెలలు ఒకచోట పదునెనిమిది నెలలు సుఖముగా గడపెను ఇట్లు మునుల యాశ్రమములందు అనుకూలముగా విహరించుచు పదియేండ్లు గడపి తిరిగి వత్తునని మాట యిచ్చిన విధమున రాముఁడు సీతతోను లక్ష్మణుని తోను సుతీక్ష్ణుని యాశ్రమమునకు మరల వచ్చెను. అట్లు అతఁడు వచ్చి మును లచే సత్కరింపఁబడుచు కొంత కాల ముండగా ఒకప్పుడు వినయముగ మహా ముని యగు సుతీక్ష్ణుని దగ్గఱ కూర్చుండి రాముఁ డిట్లనెను. 158

కానలో నిట భగవంతుఁ డౌనగస్త్య
మౌని వరుఁ డుండె నని కథల్ మౌను లాడు
నపుడు వింటి నీవన మెంతొ యధిక మౌట
నతని యాశ్రమ మెట, నుండె నరయ నైతి. 159

* మూలములో సరిదశాన పది ఎక్కువ గాగల అన్నది సంవత్సరము మొదలగు చోట్ల అన్వయించిన పదిసం ఖ్య సరిపోవును.

పూజ్యుఁ డగు నీయనుగ్రహమునను నేను
దారతో భ్రాతతో నగస్త్యాశ్రమంబు
చనియు నామునికిని మ్రొక్కి స్వయముగానె
సేవ చేయు నదృష్టము చెంద నెందు: 160

ఈ మహావాంఛ నాకుండె నోమహాత్మ!
ఇదియుఁ దీర్పవె యని రాము డిట్లు పలుక
నా మహర్షియు ధర్మాత్ముఁ డైన రాము
నరసి ప్రీతితో నపు డిట్లని వచించె. 161

నేనును నీకు నీవిషయ మిప్పుడు చెప్ప దలంచినాఁడ నీ
జానకి లక్ష్మణుం డిపుడు చక్కగ రాఁగ నగస్త్యుఁ జూడుమీ
ఏనును జెప్పకుండనె యదృష్టవశంబున నీవ యిట్టులన్
దీనిని ప్రచ్ఛ చేసితివి తెల్పెద విన్మి యగస్త్య సంగతిన్‌ఁ 162

ఇప్పు డీయాశ్రమము నుండి యీవె యైదు
యోజనము లేగి, దక్షిణ మోలి చనఁగ
సలరు నాయగస్త్య భ్రాత యాశ్రమంబు
అది మహాంతమై శ్రీమంత మగుచు నొప్పు. 1ʼ3

సమతల మైన యావనిని చక్కని పిప్పలి చెట్లతో తోట ర
మ్యమగుచుఁ గానిపించు, నది యందము లై తగు పూలు పండ్లతో
నమరి. విహంగ కూజితము లంతట మీరఁ బవిత్రతీర్థమై
యమల జలంబులౌ నదుల హంసలఁ జక్కవలన్ మనోజమౌ. 164

అట మీరొక్కటి రాత్రి యుండి యుదయం బైనంత నో రామ! యే
గుట యుక్తం బగు, మీఁద దక్షిణముగాఁ గొండొక్క దవ్వేగి యా
యట వీప్రాంతపుఁ బ్రక్క యోజన మె దూరాధ్వాన మేగంగ న
చ్చట వీక్షింతు వగస్త్య నాశ్రమము దృశ్యంబౌ ప్రదేశంబులన్. 165

పలుచెట్లన్ రమణీయ మైన వని [illegible] ప్రదేశిం హర్షించి శ్రీ
వరుఁ డేలెంగల, డిపు లక్ష్మణునకుఁ [illegible] హర్షమునం గాంత్రు ఫ
ష్కల వృక్షంబుల నావనం బుధు, [illegible] కాలమందే కనన్
దలంతేన్ వెళ్ళుమి యాయుగస్త్యముని పూత స్వచ్ఛ రమ్యాశ్రకిన్. 166

అని మౌనీంద్రుఁడు పల్కి రాముఁ డనఘుండౌ మౌనికిన్ మ్రొక్కి మౌ
ని నగస్త్యున్ గని సీతతో ననుజుతో నిష్పంద్ర వృక్షంబులౌ
వనులన్ మబ్బుల వంటిశైలముల నాపాటన్ దయారాలఁ జ
క్కని యేఱుల్ రమణీయమౌ సరసులన్ గన్గొంచు నేగెన్ వెసన్. 167

వ. అపుడు సుతీక్ష్ణ మహాముని చెప్పిన మార్గమును బట్టి పోవుచు రాముఁడు లక్ష్మణునితో నిట్లనెను. "చూడు లక్ష్మణా ! యిదిగో ఆమహాత్ముఁడైన యగస్త్య మహాముని సోదరుని యాశ్రమ మిదియే కావచ్చును. ఈ వనమునకుఁ దీసికొని పోవు మార్గమున వేలకొలది చెట్లు ఫలపుష్ప భారవశవై వంగి కనుపట్టు చున్నవి. పండిన పిప్పలి చెట్ల గంధము గాలికి వచ్చుచు కటువై కనిపించుచున్నది. ఇదిగో అక్కడక్కడ కట్టెల గుట్టలు కనిపించుచున్నవి. 168

ఇవె వైడూర్యపుఁ గాంతి చిమ్ము కుశ లిందే పెక్కులై కొయ్యఁబ
డ్డవి కన్పించెడి, నీలి మబ్బువలె శైలాగ్రస్థ శృంగం బటుల్
దివి పైకిన్ జనుదెంచి కాననపు మధ్యేదేశమం దాశ్రమా
గ్ని విధూతం బయినట్టి ధూమశిఖ కన్పించెన్ నిరీక్షింపుమీ. 169

స్వచ్ఛమైన తీర్థంబుల స్నానమాడి
స్వయముగాఁ దెచ్చిన పువు లర్చనము చేతు
రిందుచే సుతీక్ష్ణుడు వచియించినట్లు
అది నిజమగస్త్యుతమ్ముని యాశ్రమంబె. 170

జగములకు హితమును జేయు సాధు వాంఛ
మున్ను మృత్యువును జయించి పుణ్యకర్మ
యయిన యెవ్వని భ్రాతచే నాలయముగ
ఈ దిశ యొనర్పబడె వాని దీవనంబె. 171

మునుపు వాతాపి యిల్వలు లనెడి యిర్వు
రనుజులైన రాక్షసు లిట దనరుచుండ్రు
వార లెప్పుడు మిక్కిలి క్రూరు లగుచు
బ్రాహ్మణుల హత్య చేయుచు వరలు చుండ్రు. 172

ఇల్వలుఁడు బ్రాహ్మణుని రూప మెనసి సంస్కృ
తమె వలుకుచు దయవిడి శ్రాద్ధంబు కొఱకు
విప్రుల పిలిచి వేషరూపిగను భ్రాతఁ జేసి
వండి శ్రాద్ధమున భుజింపఁ జేయు. 173

పిదవ బ్రాహ్మణులు భుజియింప వేగఁ జూచి
ఇల్వలుఁడు పల్కు "వాతాపి ! యింక ధ్వనులఁ
జేయుచు నిటువెల్వడు మన జీవ మొంది
ద్విజుల మెయిఁ జీల్చుకొని వాఁడు వెడలు చుండు. 474

అట్టు లాకామ రూపులౌ నసురు లెపుడు
వేల బ్రాహ్మణులను జంపి వేయు చుండ్రు
అపుడు దేవులు ప్రార్థింప, నాయగస్త్యు
డేగి శ్రాద్ధాన రాక్షసు నిటు భుజించె. 175

అటు లగస్త్యుఁడు రాక్షసు నిటు భుజింప
నిల్వలుఁడు పూర్తిగా నయ్యో నింక నీవు
వెలికి రమ్మని సోదరుఁ బిలువ మౌని
పరిహసించుచు వానితోఁ బలికె నిట్లు. 176

నాదు మేన జీర్ణమై యైన నీదు తమ్ముఁ
డెట్లు వెల్వడు మేకయై యెనసె యముని
అనఁగ విని యిల్వలుఁడు భ్రాత యుంక మెరిగి
క్రోధమున మౌని నెదిరింప మీఁదఁ బడియె. 177

అప్పు డాయగస్త్య మహర్షి యధిక తేజు
కలిగి యగ్ని బోలెను ముందు కంటితోడ
వానిఁ దగులఁ బెట్టెను నట్టి పరమ మౌని
యాశ్రమం బిది సరసీ వనాంచితంబు. 178

వ. అని యిట్లు రామలక్ష్మణులకుఁ జెప్పుచుండ సూర్యు డస్తమించు టయు సంధ్యాకాల మయ్యెను. అంత వారు సంధ్యను యథావిధి నుపాసించి యాయగస్త్య భ్రాత యాశ్రమము చొచ్చి మునికి నమస్కరించి యా మునిచే బ్రతిగ్రహింపఁ బడి యట దుంపలు పండ్లు తిని యొక రాత్రి యుండి రాత్రి గడిపి సూర్యమండలము స్వచ్ఛముగఁ బైకి రాఁగ ఆయగస్త్యుని భ్రాతకు నమస్కరించి "ఓ మహాత్మా ! రాత్రి యిట సుఖ ముంటిమి. మీ యన్నను దర్శింపనేగెదము. సెలవిండు" అని పలికి యాముని సరే యట్లే పెళ్ళుఁ డని సెలవిచ్చి పంప ఆతండు చెప్పిన మార్గమునుబట్టి ఆవనమును జూచుచు బయలు దేఱిరి. అచ్చట నివ్వరి ధాన్యములను పనసలను తాటిచెట్లను పొగడలను తిమిశవృక్షములను ధవములను చిరబిల్వముల మధూకముల బిల్వములను తిందుశములను చివర పుష్పించి తీఁగెలచేఁ జుట్టు కొనఁబడిన వేలకొలఁది పుష్పిత వనతరువులను ఏనుఁగు తొండములచే విఱఁగ గొట్టఁబడి కోతులతో నిండి మత్త పక్షి సంఘముల కూతలచే ప్రతిధ్వనించు వృక్షములను జూచుచు దగ్గ అనే యనుసరించి వచ్చుచున్న లక్ష్మీవర్ధనుఁ డైన లక్ష్మణుని జూచి రాజీవ లోచనుఁ డగు రాముఁ డిట్లనియెను. 179

ననుపొ నాకుల నొప్పి శాంత మగు జంతుల్ పక్షులున్ గల్గు చె
ట్లను శోభిల్లుట భావితాత్మ మునిదౌ రమ్యాశ్రమం బిందె యుం
డు నటంచున్ దలఁతున్, స్వకర్మ వలనన్ బూర్వం * బగస్త్యాఖ్య నొం
దిన మౌనీంద్రుని యాశ్రమం బిదియు శ్రాంతిం బొంద విశ్రాం తిడున్.
180

హోమ ధూమాల నీయెల్ల భూమి నుండి
నారచీరలు మాలలు సౌరు నింపు
జంతువుల యూథ మొప్పు ప్రశాంతముగనె
వివిధ పక్షులు కూతలు విందు గూర్చు. 181

జగములకు హితంబును జేయు సాధు వాంఛ
మున్ను మృత్యువును జయించి పుణ్యకర్మ
యయిన యెవ్వని భ్రాతచే నాలయముగ
ఈదిశ యొనర్పఁబడె వాని దీ వనంబె. 162

ఇది యగస్త్యుని యాశ్రమ మితని భయము
వల్ల నితని ప్రభావము వల్ల నసురు
లిటకె రా,రీదిశ ననుభవింప లేరు
తొరగ శాంతులై రా యగస్త్యుండు రాగ. 138

అనఘ భగవంతు పేర దక్షిణపు దిశయు
దనుజ ధిక్కృతి గనక ప్రదక్షిణ యగు
విమల రవి పథి సడ్డిన వింధ్యగిరియు
ఇతని యాజ్ఞ పాలించి ప్రవృద్ధిగనదు. 184

---

* అగము = వింధ్యపర్వతమును స్తంభింపఁజేసినాఁడు గాన అగ×స్త్య = అగస్త్యుఁ డనీ పేరు కలిగెను. పృషోదరాది గణముచే స్తంభస్త్య అయ్యెను.

ప్రథిత కర్మలు గల్గి చిరాయు వైన
యా యగస్త్యు శ్రీమంతమౌ నాశ్రమ మిది
ఇది వినీత జనార్చిత మీయగస్త్యు
డఖిల జనపూజ్యుఁడు మన శ్రేయస్సు గూర్చు. 185

ఇట నగస్త్యు నారాధించ మింకఁ గడమ
యడవి వాస మాతని కడఁ గడపుద, మిక
ఇటు సురలును గంధర్వులు ఋషులు సిద్ధు
లనయ మీ నియతాహారమునిని గొల్తు. 186

ఇట ననృతవాదిగాని దుర్వృత్తుఁడేని
శఠుఁడు గాని కాముకుఁడేన్ నృశంసుఁ డేని
బ్రదికి యుండఁగఁ జాలఁ డీవర మునీశుఁ
డవనిని మహానుభావుండు నట్టి వాఁడు. 187

వ. మఱియు నిచ్చట సిద్ధులు దేహము విడచి సూర్య తుల్యములైన విమానము లెక్కి నవీన దేహములు దాల్చి స్వర్గము పొందిరి. ఇట దేవులు శుభము లైన భూతములచే నారాధింపఁబడి యమరత్వమును వివిధ రాజ్యముల నిచ్చెదరు. అట్టి గొప్ప యాశ్రమ పదమికి వచ్చితిమి. సౌమిత్రీ! నీవు ముందేగి యాఋషికి సీతతోఁ గూడ నిచ్చటకు నేను వచ్చినట్లు తెలుపుము. 188

అపుడు లక్ష్మణు డాశ్రమ మరుగు దెంచి
అట నగస్త్యుని శిష్యుని కనియె నిట్లు
రాజు దశరథపుత్త్రుండు రాము డిపుడు
భార్య సీతతోడ తపోవనికి వచ్చె. 189

రాము చిన్న తమ్ముండను లక్ష్మణుండ
అన్న భక్తుఁడ నిది మీరు వినియె యుంద్రు
పితరు నాజ్ఞను మేమెల్ల ఏపినమునకు
వచ్చితిమి తెల్పు మునిఁ జూడ వాంఛగలదు. 190

అప్పుడు లక్ష్మణు వాక్యంబు నాలకించి
అట్లె యని శిష్యుఁడును జొచ్చె నగ్నిగృహము
అట్లు చొచ్చి మౌని వరుని కంజలించి
చెప్పె రాముని రాకను శీఘ్రముగనె. 191

రామలక్ష్మణుల్ దశరథు ప్రథితసుతులు
సీతతోఁ గూడ నాశ్రమ క్షితికి నవఘ
నిన్నుఁ గొలువ వచ్చిరి యని విన్న పిదప
నానతింపుఁడి యేమి చేయంగ వలెనొ. 192

అన విని ముని యనె నదృష్టమునను నిపుడు
ఇంత కాలంబునకు రాముఁ డేగుదెంచె
ఇదిగొ నితని రాకను నిరీక్షించుచుంటి
వసిఁ బవేశ పెట్టుమి యింకఁ దడయు దేల. 193

అనుచు మహాత్ముఁ డైన ముని యాదృతి జెప్పఁగ వేగ శిష్యుఁడున్
ప్రణతి యొనర్చి యట్లె యని లక్ష్మణుతోడుత సంభ్రమంబుతో
పనియెను "రాముఁ డేడి ముని నారయు వేగ స్వయంబ యాశ్రమం
బున నికఁ జొచ్చుఁ గాక" యన ముందుగ లక్ష్మణుఁ డేగి శిష్యుతో 194

రాముని సీతఁ జూడఁ గని ప్రశ్రితుఁడై ముని శిష్యుఁ డంతటన్
రామునితో నగస్త్య ముని రాజు వచించిన మాట చెప్పి యా
రాముని గౌర వార్హుని త్వ రా న్వితుఁడై బహుగౌరవంబుతో
నామముని యాశ్రమాంగణము నందు ప్రవిష్టునిఁ జేసె నాదృతిన్. 195

అంత రాముఁడు సీతతో ననుజుతోడ
ఆప్రశాంత హరిణముల నావరింప
బడిన యాశ్రమంబు గనుచు భక్తితోడ
ఓనము మునిఁ జొచ్చె నాశిష్యు ననుసరించి. 196

రాముఁడటఁ బ్రతిష్ఠించిన బ్రహ్మను నగ్ని విష్ణు
నామహేంద్రు సూర్యుని చంద్రు నాథగు నాకుబేరు
ధాతను విధాత వాయువు తన్నాగరాజు స్కందు
వరుణు గాయ్మత్రిని నవంతు వసులఁ గనియె. 197

అపు డగస్త్య మౌనియు శిష్యు లావరింప
నెమరుగా రాఁగ దీప్తి జ్వలించు మునుల
యెదుట రాముఁ డామునిఁ జూపి యిట్టు లనియె
లక్ష్మివర్ధనుఁడైన ట్టి లక్ష్మణునికి 198

అరయు లక్ష్మణ! భగవంతుఁడౌ నగస్త్యుఁ
డిదిగొ వచ్చుచుండెను తపోనిధి యతండు
అని మహాబాహువౌ రాముఁ డర్కతేజుఁ
డౌ నగస్త్యపాదముల నపుడె పట్టె. 199

వ. అట్లు రాముఁ డాయగస్త్యుని పాదములను బట్టుకొని యుండ నా
మహానుభావుఁ డగు నగస్త్యుఁడు రాముని ప్రతిగ్రహించి పాద్య మిచ్చియాసన
మిడి కుశల ప్రశ్నలడిగి అగ్నిని వ్రేల్చి అర్ఘ్య మిడి అయతిథుల నందఱను
గౌరవించి వానప్రస్థ విధితో వారికి భోజన మిడి తాను ముందు గూర్చుండి
యాసనమునఁ బ్రాంజలియై కూర్చున్న యాయతి యగు రామునితో
నిట్లనియె. 200

అనయు మగ్నిని వ్రేల్చి యర్ఘ్యంబు నిచ్చి
అతిథిఁ బూజింప వలయును నట్లు గాక
అతిథి పూజ తపస్వి చేయకయె యున్న
అనృత సాక్షివలె స్వమాంస మతఁడె తినును. 201

అఖిల లోకంబునకు రాజ వైతి వీవు
ధరణిని మహారథుండవు ధార్మికుఁడవు
పూజనీయుండవును మాన్య పూరుషుఁడవు
ఇటు ప్రియాతిథివై వచ్చి తిచట కిపుడు. 202

అనుచు నిటు చెప్పి పూలు పండ్లను నొసంగి
ప్రకటిత పూజించి యిట్లు వాక్యంబు పలికె
ఇదిగో హేమ వజ్రాంకితమై యొసంగు ధనువు
విష్ణు దేవతాకముఁ గూర్చె విశ్వకర్మ! 203

ఇది యమోఘము సూర్యుతో నిదియు సమము
ఈశరము బ్రహ్మ యిచ్చెను నిదిగో నింద్రు
డక్షయశరాలతో నిచ్చె నంబుపొదులు
మండు నగ్నులు వలె నివ్వి నిండి యుండె. 204

ఇదిగో బంగరు బొరగల వడమకత్తి
దీనితోడ ధనుస్సుతో దితిజతతుల
యుద్ధరంగంబునన్ విక్రమోజ్జ్వలుఁ డయి
చంపి విష్ణు సురల కొసంగె లక్ష్మి. 205

ఇదె ధనుస్సును నంబుల పొదులు శరము
ఖడ్గము గ్రహించి మాన రక్షకుఁడ వీవు
వజ్రమును దాల్చి నిత్యము వజ్రివోలె
జయము పొందుము దీనరక్షణము చేయు. 206

వ. అని మహాతేజుడైన యగస్త్యుఁ డిట్లు సమస్తమైన యస్త్రశస్త్రా
యుధము నిచ్చి మరల నిట్లు పలికెను. 207

"రామ! ప్రీతిఁ బొందితి భద్రంబ సువ్రత
లక్ష్మణా! తుష్టిఁ గాంచితిఁ బ్రణతి చేయ
సీతతో వచ్చితిరి గాన క్షేమ మొప్ప
మీరు భద్రంబు పొందెడి వారె సువ్రత. 208

దారి యాయాసకష్టము శ్రమ తావ మొందు
జనక పుత్రియు విశ్రాంతి గొనఁగఁ గోరు
భర్తపై ప్రేమ బహుదోష వనముఁ జేరి
ఇట్టి సుకుమారి కూడ దుఃఖింప కుండె. 209

రామ! యీసీత సుఖ మొందు లాగు చేయు
నిన్ను వెంటాడి దుష్కర నియమ మొందె
సముని ప్రేమింత్రు విషము విసర్జనంబు
చేతు రదియ స్త్రీల ప్రకృతి సృష్టి మొదలు. 210

మెఱపుల లోలత్వంబును
వరశస్త్రంబుల సుతీక్ష్ణభావము నటులే
గరుడానిలముల వేగము
గరిత లనుసరించుచుంద్రు గద లోకములో. 211

ఈనీదు భార్యయొ
ఈ నిఖిల దోషముల త్యజించెను జుమ్మీ
ఈనారి శాఘ్య సజ్జన
మానితయె యరుంధతివలె మన్నింప నగున్. 212

సౌమిత్రిచేత నీవే
భూమిని వాసంబు చేసి మోదింతువొ యీ
భూమి యలంకృతమై యా
భూమి వెలయుచుండుఁ జుమ్మి భూపతిపుత్రా! 213

వ. ఓ మహాబాహూ ! నీవు సీతతోను లక్ష్మణునితోను ఇట సుఖముగా వసుండుము. సూర్యుఁ డస్తమించెను. సంధ్య సమీపించినది. ఇదిగో రాత్రి తిరుగు ప్రాణులు మృగములు పక్షులు పర్వతాగ్రములందు అణఁగి యున్నవి. ఆకాశ మంతయు రాత్రి చీకటిచే వ్యాప్తమై వెలుగులేక యున్నది. అని

మహాత్ముఁ డైన యగస్త్యుఁడు పలుక రాముఁడు సీతతోను లక్ష్మణునితోను మహర్షికి నమస్కరించి రాత్రి యట వసించి ప్రొద్దుటనే లేచి సంధ్య నుపాసించి సూర్యవర్చసు గల యగస్త్యమహామునిని సమీపించగా ఆమునియు తగిన రీతిగా నిట్లు "ఓరామా : రాత్రి సుఖముగా నిద్రించితిరా"అని యడుగ రాముఁ డనెను. "మహానుభావా ! మేము యథావిధిగా సత్కరింపఁబడితిమి. శయనాస నాదులచేత మేము రాజు దశరథుని యంతఃపురమందు వలె సుఖముగానుం టిమి" అనఁగా మరల ముని యిట్లనియె. కాకుత్స్థా ? దశరథ నరేంద్రుఁడు ఏర్పఱచిన సమయము చాలవఱకు గడచినది. నీవు యయాతివలె తండ్రిని తరింపఁ జేసితివి, నీవు ధన్యుఁడ వైతివి" అనుటయుఁ దిరిగి రాముఁ డిట్లని యెను. "ఓ మహానుభావా ! మీ యనుగ్రహమున ధన్యుఁడ నైతిని. రాజు నాచేఁ గాక తన గుణములచేతనే తరించెను. తన పుణ్యకర్మలచేతనే స్వర్గము బొందెను. కాని యీ ప్రదేశము అంతయు శరణు లేని దయ్యును శరణు గల దట్లయ్యె. దీనిని తత్త్వముగఁ జెప్పి యనుగ్రహింపుడు. ఇది తెలిసికొన వేడుక జనించెను". అనుటయు ఆముని యిట్లనెను. "రామ ! సరిగా వినుము, ఈ దేశము సంగతి చెప్పెదను. ఈప్రదేశ మంతయు మహాత్ముఁడైన దండకునిచే త్యజింపఁ బడెను. భార్గవుని శాపముచే నీదేశ మంతయు నిర్మానుష్య మైనది. వృక్షములు గుల్మములు లేనిదై తాపసులచేఁ గూడ వర్జిత మైనది. ఇది ఘోర మైన యడవి యైపోయినది. వేయిన్నూర యోజనములు ఈ దక్షిణదిశయందలి వింధ్యపాదము ఇట మేఘము కురియ లేదు. గాలి సుఖముగావీచదు. ఇక్కడ మహాదారుణమైన రాక్షస భయ మర్పడెను. ఇది యిట్లు చాల వేల సంవత్సర ములు మనుష్యులు లేక యుండెను. గంధర్వులు ఋషులు దేవులు అందఱును విడిచి వైచిరి. కొంతకాలమునకు దైవవశమున నేనిటకు వచ్చితిని. నాతోపాటు ఇక్కడకు మేఘములు వచ్చెను. కొంతకాలము స్వేచ్ఛగా వర్షములుకురిసెను. చాల వత్సరములు ఇటకు యమదూతలు వ్యాధులు రారైరి. నేను మనసులో చింతింప వృక్షములు నదులు రమ్యతటాకములు తామరకొలనులు సుఖశీతల మైన వాయువులు ఏర్పడినవి. ఇంక సస్య శ్యామలమై దేశ మయ్యెను. ఋషు లును వచ్చిరి. ఇదంతయు అతని శాపముచే నయ్యెను. ఉగ్ర కర్ము లగు రాక్షసులచే ఉపద్రవము గల దయ్యెను. నీ వెప్పుడైతే చిత్రకూటమునకు వచ్చి

ఇపో అవి మొదలుకొని రాక్షసులు మునులను బాధింపఁ జొచ్చిరి. మానద ! నీవు ఋషుల కథను వినుము. దండకారణ్య నివాసు లైన ఋషుల రక్షణ కై నీవు వచ్చితివి. వారిని రక్షింపుము. కాకుత్స్థా ! నీవు త్రిలోకములను గూడ రక్షింపఁగలవు. నీవు కోపించినచో రాక్షసులు హతులయి పోదురు. శాప దోష ముచే ఇక్ష్వాకు పుత్రుఁ డైన దండకునిచే నీదేశము నిరాకృత మైనది. ఈ దండకారణ్యమునకు శాపాంతము గలిగించుటకై యిక్కడకు వచ్చితివి. నీ పూర్వపుత్తు లైన శత్రువులచే నీదేశము నిరాకరింపబడినది. ఇందుచే దీనిని దండకారణ్య మందురు. ఇది యీ దేశమును గుఱించిన వృత్తాంతము. 214

ఇటుల నాముని చెప్ప నాలించి మ్రొక్కి
అగ్నివలె వెల్గు మునితోడ నతఁడు పలికె
ధన్యుఁడ నయితి ననుగృహీతాత్ముఁ డైతి
ఋషి వరమిడి గుణముల హర్షించెఁ గాన, 215

కాని యిది చెప్పు మెచ్చట నేను నిలిచి
సుఖము యుందు నీరము లెందు సులభమగునో
అనఁగ విని యొక నిముషంబు ధ్యానముండి
ధీరుడా ముని పల్కెను ధీర మొప్ప. 216

ఇచట నుండి ద్వియోజనా లేగ నచట
చాల పండ్లు దుంపలు నీళ్లు చాల మృగము
లున్న దేశము శ్రీలతో నొప్పు చుండు
పంచవటి యని యుయ్యది ప్రథిత మయ్యె. 217

అచట కేగి యాశ్రమమును నమరఁ గూర్చి
పితరు నాజ్ఞ చేయుచు మీరు ప్రీతిఁ గాంత్రు
నీ సమస్తవృత్తము గంటి నేను నాత
పః ప్రభావాన దశరథువయిని ప్రేమ. 218

నీవు హృదిలోని భావమున్ నేను నాడు
తపముచేఁ దెల్సికొంటి, నీధరణి నీవు
ఉండు ననినను నీభావ మెఱిగి నెఱింగి
పంచవటి కేగు మని నేను పలికినాను. 219

ఆవన ప్రదేశము చాల యంద మైన
దచట జానకి యానంద మంది యలరు
ఆ ప్రదేశము శ్లాఘ్యముమా యటు నెదరిగ
కలదు గోదావరి నది, యుం దలరు సీత. 220

పండ్లు దుంపలు నున్నవి పలు రకాల
పక్షి తతులుండె శాంతమై పావన మయి
రమ్యమై యుండె నీవా భద్రంపు నడత
గలుగు వాఁడవు మునుల రక్షణ మొనర్తు. 221

ఇదిగొ నిటు చూడు మీయిప్ప వృక్షవనము
కన్పడును నుత్తర దిశ కేగంగ మఱి
యెదురుగా సమతలి దిగి యిట్టె పోవ
గొరికి దరి పంచవటి పుష్పభరిత మొప్పు. 222

ఇటు లగస్త్యుఁడు చెప్ప నాలించి రాముఁ
డాతపసి సత్యవాక్యుని యనుమతి గొని
లక్ష్మణునితోడ సీతతో ప్రాంజలించి
యచటి నుండి పంచవటికి నరిగినారు. 223

పంచవటికిని బోవుచు బాటమధ్య
భీమబలు జటాయును వటవృక్షమందు
గొప్పదేహముతో నుండ నప్పు డరసి
దనుజుఁగాఁ దలంచి నీవెవ్వఁ డనుచు నడిగె. 224

ఆ జటాయువు మధురవాక్యంబుతోడ
సౌమ్యముగఁ జెప్పి కడు సంతసంబు గూర్చ
నటుల నసె వత్స! నీతండ్రి కనఁగు సఖుఁడ
ననఁగ పితృసఖున్ రాముఁడు నపుడు కొలిచె. 225

అతని కులమును పేరును న్యాయరీతి
నడుగ రాముని వచనము నాలకించి
ప్రాణి సృష్టియున్ వంశమునాత్మ నా
మాజటాయుపక్షి వచించె నప్పు డిటుల. 226

వ. ఓ మహాబాహు! పూర్వకాలమున ఏ ప్రజాపతు లుండిరో వారిని గూర్చి మొదటినుండియుఁ జెప్పెద వినుము ఆ ప్రజాపతులలో మొదటివాఁడు కర్దముఁడు పిదప విక్రీతుఁడు శేషుఁడు సంశ్రయుఁడు బహుపుత్త్రుఁడు పులస్త్యుఁడు మరీచి అత్రి క్రతువు పులస్త్యుడు అంగిరుడు ప్రచేతుఁడు పులహుడు దక్షుఁడు వివస్వంతుఁడు అరిష్టనేమి కశ్యపుఁడు అనువారు కలిగిరి. అందు దక్ష ప్రజాపతికి అరువదిమంది కూఁతులు కల రని వింటిమి. వారిలో ఎనమండుగురను కశ్యపుడు గ్రహించెను. వారు అదితి, దితి, దనువు' కాలికతామ్ర, క్రోధవశ, మనువు అనల అనువారు.

ఆ కన్యలను జూచి కాశ్యపుఁడు ప్రీతి పొంది మీరు నాతో సములైన త్రైలోక్యభర్తలైన కుమారులను కనుఁడు అని పలికెను. దితి యూ కాశ్యపుని మాటలందు ప్రీతి కల దయ్యెను. దితియును, కాలికయు అతనిమాటలులను ప్రీతితో ననుసరించెను. మిగిలినవారు అనుసరింపలేదు. అదితియందు ఆదిత్యులు వసువులు రుద్రులు అశ్వినులు మొత్తం ముప్పది ముగ్గురు పుట్టిరి. దితి దైత్యులను కనెను. వనసముద్రములతోఁ గూడిన యీవసుమతి వారిది. దనువు అశ్వగ్రీవుని కనెను కాలిక నరకుఁడు కాలకుఁడు అనువారిని కనెను. తామ్ర అను నామె క్రౌంచి భాసి, శ్యేని ధృతరాష్ట్రి శుకి అనుకన్యలను ఆరుగురిని కనెను. అందు క్రౌంచి ఉలూకములను, భాసిభాసములను, శ్యేనిడేగలను గద్దలను ధృతరాష్ట్రి హంసలను చక్రవాకములను, శుకి నతను, నత వినతను

కనెను. క్రోధ వశ మృగిని, మృగమందను హరినిభద్రమదను మాంతంగిని, శార్దూలిని శ్వేతను సురభిని సురసను కద్రుకను కనెను మృగి సర్వ మృగము లను కనెను. మృగమంద ఋక్షములను సృమరములను చమరములనుకనెను. భద్రమద ఐరావతిని కనెను. అది ఐరావత నును మహాగజమును కనెను. మతంగి ఏనుగులను, శార్దూలి గోలాంగూలములను పెద్దపులులును శ్వేత దిగ్గ జములను కనెను సురభి రోహిణిని గంధర్విని కనెను. రోహిణి గోవులను, గంధర్వి గుఱ్ఱములను సురస నాగములను కద్రువ పన్నగములను మనువు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు అను మనుష్యులను కనెను. ముఖమునుండి బ్రాహ్మణులు, వక్షఃస్థలమునుండి క్షత్రియులు తొడలనుండి వైశ్యులు పాదముల నుండి శూద్రులు పుట్టి రని శ్రుతి అవల సర్వపుణ్య ఫల ములు గల చెట్లను వినతయు శుకియు సౌత్రియ కద్రువయు సురస చెల్లెంద్రు కద్రువవేయి ముఖములు గలిగి భూమి ధరించు నాగుని కనెను వినత గరుడుడు అరుణుఁడు అను వారిని కనెను. అరుణునికి నేను పుత్త్రుఁ డను సంపాతి నాయన్న నన్ను జటాయు వందురు. నేను శ్యేని కొడుకను నీవు కోరినచో నీనివాసమున నేను సాయముగ నుందును. ఈ అడవి దుర్గమ మైనది. మృగ రాక్షసులచే నిది సేవింపఁ బడినది. నీవు గాని లక్ష్మణుఁగాని ఎక్కడ కైనను వెడలినచో నేను సీతను కాపాడుదును "అని జటాయువు చెప్పఁగా విని యతనిని పూజించి సంతోషముతో అతనిని గౌగిలించుకొని యాత్మ యుతుఁడై జటాయువు చెప్పిన తనతండ్రితో జటాయువునకు గల నఖ్యమును గూర్చి మాటిమాటికి తలచుకొనెను. అక్కడ అతఁడు సీతను జటా యువు దగ్గర న్యాసముగా నుంచి అతిబలముగల యాపక్షితోఁ గూడనే లక్ష్మణుఁడు కూడరాఁగా మిడతలను అగ్నివలె రిపులను దహింపగోరువాఁడై పంచవటికి వెళ్ళెను. 227

అట్లు వివిధ సర్వ మృగాల కాలయమగు
పంచవటిఁ జేరి తేజ మొప్పారు నను జుఁ
గనుచు రాముఁ డిట్లనె "మౌని మనకుఁ దెల్పి
నట్టి పంచవటి యిది పుల్లాగ్రవాటి. 228

వనమున సంచరించి యెట వాసము చేయుట కర్హమౌనో నై
పుణీ కలవాఁడ వీజనకపుత్రికకున్ విహరింప నెచ్చటన్
అనువుగ నుండునో మనకు నందఱ కెచ్చట వీలెయౌనో యే
వనిని జలాశయంబు దరిబాగుగ నుండునొ చూడు మిప్పుడన్. 229

ఎచట వనము రమ్యంబగు
నెచట స్థలము రమ్యమౌచు వీక్షింపఁబడున్
ఎచట సమిధలు కుశపు
ష్పచయము జలము దరినుండు సరిగాఁ గనుమీ. 230

అని రాముండు వచింపఁగ
విని యంజలి పట్టి సీత వినుచుండఁగ ల
క్ష్మణు డిటు వచియించెను రా
మునితోడ నపుడు వినయము మునుకొన ప్రీతిన్. 231

నీదరి నూరేం డ్లున్నను
నాది స్వతంత్రంపు జీవనము కా దెటులేన్
"ఈదేశము రమ్యం బిదె
నాదుమతికి ప్రియ మనుచును నాకుం జెపుమీ. 232

అటు నుహాత్ముఁడౌ లక్ష్మణుఁ డాడినట్టి
పలుకుల విని సర్వగుణ సంపన్నమైన
దేశమును విమర్శను జేసి దేశ మదియె
ఎల్లకును మంచి దని రాముఁ డిష్టపడియె. 233

ఆతఁ డాదేశ మెంతయు నాశ్రమమున
కష్ట మని తెల్సికొని యపు డెంతొ యలరి
చేనితో చెయి గ్రహియించి ప్రీతితోడ
ననుజుఁ డగు లక్ష్మణునితోడ ననియె నిట్లు. 234

"సౌమ్య ! ఈదేశ మెంతయు సరిగ నిచట
పూలచెట్లతో శ్రీలు సంపూర్ణ నీవు
ఇటనె యాశ్రమ పదము శ్లాఘింపఁదగిన
పగిది చక్క నిర్మింపఁగా దగును జుమ్ము. 235

రవిబింబంబును బోలు తామరపువుల్ బాగై సుగంధంబులన్
కలియం జిమ్మఁగ శ్రీల నొప్పి తటవృక్షశ్రేణిఁ బుష్పించు క్రొం
బువు లందాలొలికించుచుండఁగ మనోమోదంబు గల్గించె నీ
భువి, గోదావరి, యాయగస్త్యుఁడు మహాత్ముం డన్నయట్టుల్ గడున్.
236

కారండవములు చక్కవలు రాయంచలు
మృగపంక్తు లటనట మెసలు చుండె
నెమిలికేకల మ్రోసి నెటి నొక్కచో పుల్ల
తరుల నెత్తగు గుహల్ గిరులఁ దనరు
రాగి బంగరు వెండి రంగు ధాతులు పూయు
కిటికీలవలె నేన్గు లటఁ దనర్చు
తాలతమాల సాలాలు ఖర్జూరముల్
పనస లామ్రకములు పర్వియుండు

చంపక శమీ లికుచములు స్పందనములు
చూత పున్నాగ తిమిశముల్ కేతకములు
తిలక చంద నాశోక పాటల ధవాశ్వ
ఖదిర కింశుక నీవ వృక్షములు వెలయు. 237

ఇది పుణ్యంబును మేధ్యము
నిరి బహుమృగ పక్షి రాజి వృతమై యుండున్
ఇది రమ్యంబగు. నిచట సు
హృదుఁడు జటాయు వెనగుఁ గద నిట నుంధమయా. 238

పురుషవ్యాఘ్రమ! క్షణాన సీత వెదకన్ బూర్ణంబ యత్నింతమే
త్వరగాఁ బోయి వనాన నీవు తలఁపన్ బాగొప్ప గాలింతమే
పరితాపంబును బొందరా దనుచు సౌభ్రాత్రంబ యేపార వా
రిరి సౌమిత్రి వచింప, నట్ల యని యన్వేషింపఁగా సాగిరే. 966

వివిధంబుల్ గిరులున్ వనుల్ గుహలనన్వేషించుచుం బోయి వా
రవు డెచ్చోటను సీతఁ గానరు మనం బాందోళనం జెంది భ్రా
తపయిన్ రాముఁడు పేయి యాన్చి యిటు చింతన్ బల్కె సౌమిత్రి భ్రా
త! వసంతిన్ గన పేమి చేత మన బాధన్ లక్ష్మణుం డిట్లనెన్. 967

ఇదె వీక్షింపుము దండకాటవిని నన్వేషించుచున్నాము గా
సుదతిన్ మైథిలి నింకఁ జూచెదము; బలిన్ సూక్ష్మంబ బంధించి యా
విదపన్ విష్ణువు భూమిఁ బొందినటులన్- వేగఁబుగా నంచు నీ
విధి సౌహార్ద్రముతోడ లక్ష్మణుఁడనం బెన్జాలి రాముఁ డనెన్. 968

వనముల్ విచ్చిన తమ్మిపూల కొలఁకుల్ పల్శైలముల్ కందరా
లను కానల్ సెలయేళ్లు కొండపఱియల్ సర్వంబు గాలించి యెం
దును ప్రాణంబులకంటె గొప్పదయి విందుల్ సేయు, నాసీతఁ జూ
డని యంచున్ విలపించుచున్ క్షణము వైక్లబ్యంబుతో స్రుక్కుచున్. 969

కడు సంతాపము బొంది యొళ్ళు సడలన్ గాటంపు బుద్ధి చనన్
పడిఁ జైతన్యముపోవ దైన్యమున వైళంబ నిట్టూర్చి ప్రే
మడి సీతా! యని బాష్ప గద్గదిక రాముం డేడ్వ సౌమిత్రి యూ
రడిలన్ జేయుచుఁ జేతు లొగ్గి వివిధాలన్ ధార్మికుండై యనన్. 970

విని రాముఁడు భ్రాత పెదవు
లనుండి జాఱిన పలుకుల లక్ష్య మిడక వా
ని ననాదరణము చేయుచుఁ
దన ప్రియమ సీతను మఱిమఱి తలఁచుచు నేడ్చెన్. 971

తన ప్రియ సీతను రాముఁడు
కనకయె కనుచున్న యట్లు కామార్తుండై
అనుభూతిని మాత్రమె యొకఁ
డనయి, తెలుప రానియట్లు కథ విలపించెన్. 972

పువు లనినన్ బ్రియ మగుటన్
ఇష్టఁపోఁడీ ! ప్రియ ! యశోకపుం గొమ్మలతో
మిషలఁ గననియటు నీవు త
నువు గప్పుకొనుదువె శోక వేదన మిడకన్. 973

నునుపగు ననంటి బోదెల
నునుపును గొను నీదు తొడలు నునుపనఁటులతో
గననటు దరికొని యుండియు
నిను దాచుకొనంగ లేవు నిన్నిటు దేవీ ! 974

పరిహాసం బిఁక జాలును
తరుణీ ! సీత ! యిది బాధ తద్దయుఁ గూర్చున్
మఱికొండ గోగు వనమును
దరిసియె గొల్చెదవు దేవి దయగొను భద్రా! 975

అలసిన నా కుపహాసం
బులతోఁ బనియేమి ప్రియురా! ముదమిడు మిపుడే
వలదిఁక నుపహాసము నా
కిల నుపహాసంబు గూడ నిఁక రుచి యిడదే. 976

పరిహాస ప్రియ వనుచును
నెఱుఁగుదు నీశీలంబుగూర్చి యిఁకఁ జాలునతే
మఱియందు విశేషించియు
పరిహాసము నాశ్రమమున వల దిఁకఁ దగదే. 977

ఇటు రమ్ము విశాలాక్షీ!
యిటు నీయీ పర్ణశాల యిదె శూన్యంబౌ
స్ఫుటముగ ప్రియ తినఁబడెనో
కట! హృతయో యేడ్చు నన్ను గను మె యుపేక్షన్. 978

కనులన్ నీరిడికొని యిదె
కను లక్ష్మణ! లేళ్ళ కదుపు కట! ప్రియ నసురుల్
తినిరని యను హాయార్యా!
చనితి వెటకు నయ్యొ సాధ్వి! సరస సువర్ణా! 979

ఇపు డాకైక సకామ య
యి పొంగి పోవు నిను బట్టియిఁక దేవీ!
అపుడో నీతో వచ్చితి
నిపుడో యిదె నీవు లేకయెటు లేగెదనే. 980

ఎటు శూన్యం బంతిపురిని
కటా! ప్రవేశింపఁగలనొ; కని నను జనులం
ద్రిటు; నిర్వీర్యుఁడ నని ప్రియ
నటు పోఁగొట్టు కొను పించు నని యదయుఁ డనిన్. 981

వనవాసము తీర్చిన నను
జనకుఁడు కుశల మడుగఁ గనఁ జాలుదు నెటులన్
జనకుఁడు నిను జూడక నను
గని సుత ప్రేమను దపించి కను మోహంబున్. 982

ఇకఁ బోని భరతుఁ డేలెడి
సకల మగు నయోధ్యపురికి జనఁబో నిటులై
సకి లేని స్వర్గమో నా
కిఁక శూన్యం బగుచుఁ దోఁచు నెల్లపుడై నన్. 983

వనమున నన్ను విసర్జించితి యె
చనుమి యయోధ్యాపురికి సౌమిత్రి! పడిన్
వినుమీ సీతను విడి ల
క్ష్మణ! నే జీవింపలేను చనుమీ తొరగా. 984

కరము బిగియార భరతుని గౌఁగలించు
కొనియె నామాట గాఁగ వాకొనుమి యిట్లు
రాముఁడే యనుజ్ఞను నిడె రాజ్య మెల్ల
పాలనము చేయుమీ నీవు భరత! యనుమి. 985

జనని కైక సుమిత్ర కౌసల్య యిపుడు
న్యాయరీతిని నభివాదనంబు చేయు
ఏను చెప్పిన రీతి గావించు నీవు
యత్నపూర్వకమ్ముగ రక్ష యాచరింపు. 986

శత్రుసూదన సీత నాశంబు గూడి
విస్తరముగ జననికి నివేదనంబు
చేయు మని దీనఘుగ వచింపఁ బిదప
వికలముఖుఁ డయి సౌమిత్రి వెతలఁ బడియె. 987

—: రాముని శోకము :—

వ. అప్పు డారాముండు ప్రియాశూన్యుండయి శోకముచేతను మోహంబు చేతను పీడింపఁబడి అసలే యార్తుడై యున్న సోదరుని కింకను విషాదము గలిగించుచు తాను మరల నింకను విషాదము పొంది నిట్టూర్చి యేడ్చుచు లక్ష్మణునితో నిట్లనెను. 988

క్షితిలో ననుబోలెన్ దు
ష్కృతములు గావించినట్టి రెండవ వాఁడో
మతిఁ గనిపింపఁడు! వెతపై
వెత వరుసగ నయి హృదయము వెస భేదించున్. 989

మును బుద్ధిపూర్వకంబుగ
క్షణక్షణము చేసినట్టి కలుషము లెల్లన్
కన నిపుడు పండెఁ గనుకనె
వనటపయిని వనట నేను పడుచును నుంటిన్. 990

మొదటన్ రాజ్యము పోయెను
పిదపన్ బంధుల విరహము పితృ నాశనమున్
పిదపన్ మాతృ వియోగము
నొదవియు నన్నియును బెంచు నుద్వేగంబున్. 991

వనికిన్ వచ్చిన తఱి ల
క్ష్మణ! సర్వవ్యథలును క్షయమే యయ్యెన్
ఘన సీతా విరహముచే
ననలము కాష్ఠాలఁ బోలె నవి మఱి పెరిగెన్: 992

వదెన యిట రాక్షసునిచే
వదపడి బల్మిని హరింపఁబడి మింటను పెన్
వ్యథ భీతిని బాబు మనుచు
వదెపదె విలపించి యుండు స్వరము వణంకన్. 993

మురు వగు కుంకుమమునకును
నెఱి యగు చందనమునకును నెలవయి సొంపై!
తిరుగు ప్రియురాలొమ్ము దైత్యులు
కొఱికి తినఁగ నెత్తు రోడఁ గూలియె యుండున్. 994

ఘనుపై స్ఫుట మృదు సంభా
షణ గలిగి కురుల బరువున సరి వంగిన దా
మనుగుం బ్రియమౌ మోము కలదై
త్రుణి పోటఁ బడి గ్రహభుక్త తుహిన కరుండౌ. 995

మరువగు ముత్తెపు సరులకు
నిరపై నా ప్రణయిని మెడ నిల్చె త్రుటిలో
తురిమియు రాక్షసులును నె
త్తురు నిజముగఁ గ్రోలియుంద్రు తూర్ణము సుకటా. 996

వనిలో విజనములో నా
కనుమొఱగి ప్రియను నసురులు గ్రక్కున లాగన్
నను దలఁచి పొడుగు దీనపుఁ
గనులన్ గని కురరివోలెఁ గడు నేడ్చెను బో 997

మిక్కిలి యుదార శీలము
నెక్కొను మీ వదెన మున్ను నిడుదగు శిలపై
గ్రక్కునఁ గూర్చుండి నగుచు
వాక్కులు నీతోడఁ బలికె స్వచ్ఛస్మితయై. 998

వరనదియగు ఈ గోదా
వరి ప్రియురాలికి నిరతము బహుళ ప్రియము, ఈ
తణ్ణి నటు చను నని తలఁచెద
పరుగద యొంటరిగ నామె యనయం బెపుడున్. 999

నళినానన నళిన విశా
లలోచన నళినములు గొను లాలసఁ జనెనో
నళినముల కెపుడు పోవదు
నళినములను గోయఁ జనదు నను విడి యెపుడున్. 1000

మనుపై స్ఫుట మృదు సంభా
షణ గలిగి కురుల బరువున సరి వంగిన దా
నునుగుం త్రిశిరవోము ఖల దై
త్యుని పోటం బడి గ్రహఘుక్త తుహిన కరుండా. 995

మరువగు ముత్తెపు సరులకు
నిరవైన నా ప్రియయిని మెడ నిక్లే త్రుటిలో
తురిమియు రాక్షసులును సె
త్తురు నిజముగఁ ద్రోలియుంద్రు తూర్ణము సుకటా. 996

వనిలో విజనములో నా
కను మొఱగి ప్రియను నసురులు గ్రక్కున లాగన్
నను దలఁచి పొడుగు దీనపుఁ
గనులన్ గని కురరివోలెఁ గడు నేడ్చెను బో 997

మిక్కిలి యుదార శీలము
నెక్కొను మీ వదెన మున్ను నిడుదగు శిలపై
గ్రక్కునఁ గూర్చుండి నగుచు
వాక్కులు నీతోడఁ బలికె స్వచ్ఛస్మితయై. 998

వరనది యగు ఈ గోదా
వరి ప్రియురాలికి నిరతము బహుళ ప్రియ, ఈ
తట్టి నటు చను నని తలఁచెద
సరుగద యొంటరిగ నామె యనయం బెపుడున్. 999

నళినానన నళిన విశా
లలోచన నళినములు గొను లాలసఁ జనెనో
నళినముల కెపుడు పోవదు
నళినములను గోయఁ జనదు నను విడి యెపుడున్. 1000

విరిసిన తరువుల వనమిది
మురువగు పలు పక్షి తతులఁ బొలుపయి యుండెన్
మురిసెనొ వని; కిటులనఁ దగ
నరుగడ నొంటరిగ నామె యతి భీరువుగా : 1001

సవితా! కృతా కృతజ్ఞుఁ
డవు సత్యాసత్య కర్మలకు సాక్షివి నా
కువలయ దృశ జనకజ యెం
దు వెళ్ళెనొ, హృతయొ, వ్యధితుఁడఁ దొరగాఁ జెపుమీ! 1002

అఖిల లోకాల నీవరయునిది లేదు
అన్ని సంగతులను నీవ యరయు దెపుడు
పవన! కుల పాలినిని నాదుపత్నిఁ గంటె
చెంగిలిరొ చంపిరో లేక త్రోవఁ గలదొ. 1003

అని శోక వశుం డయి చే
తన లేక విసంజ్ఞుఁ డగుచు తలిచేడ్చెడి రా
ముని గని యదీనుఁ డగు ల
క్ష్మణుఁ డనె న్యాయమున నుండి కాలోచితమున్. 1004

వెత వర్జింపుము, ధృతి గొను
సతతోత్సాహమున వెదకఁ జాలుము సీతన్
సతతోత్సాహము గల నరు
లతిదుష్కర కర్మమైన పండదు వ్యథలన్. 1005

అని యతి పౌరుష మొప్పఁగ
వినిపెడి సౌమిత్రి నుడుల విని రాముండున్
గణియింపక ధైర్యము విడి
వనటను గడు పొంది మరల వ్యథితుం డయ్యెన్. 1006

జ్ఞాతులున్ లేక యాజానకిన్ గనక మే
లొ్కనిన నాకును నికల్ చనవయింక
సీత కన్పించుచోఁ జేరి మందాకినిన్
ప్రస్రవణ జలస్థలాలఁ గొంతు
ఈమహాబలమృగాలిఁక నాకు నచియింపఁ
దలచి నటు తదింగితాలు తెలుపు
ఇక వృక్షములు మాకెల్లఁ దెలియు నని
యన్నటు తల లిటు లటుల నూపు

ఏదిశ వయిపు సీత హరింపఁబడియె
ఆదిశ మృగముల్ పాఱి యధిపుఁ జూచె
అదియె పథి భువి యని మది ననుజుఁ డెఱిఁగి
తత్వచన సార మగు నింగితములఁ జూచె. 1012

అపుడు లక్ష్మణుఁ డన్నతో ననియె నిట్లు
'సీత యెక్కడ' నని నీవు చేరి యడగ
ఈమృగములు వెంటనే లేచి యిప్పుడిటుల
దక్షిణపు దిక్కు భువిఁ జూపెఁ దత్క్షణంబ. 1013

వ. అని అపుడు లక్ష్మణుండు మంచిది పోదము, ఈ దక్షిణదిక్కుగా పోదము. వదెన గుర్తులు ఏమైన గనుపట్టునేమో ఎక్కడ నైనఁ గనిపించునేమో చూతము" అనఁగా సరే అని రాముండు దక్షిణదిశగా బయలుదేఱె. ఇట్లు వారిరువురు భూమిపైపు చూచుచు ఒండొరులు మాటాడుకొనుచు పోవుచుండ దారిలో వారికి భూమిపైని పువ్వులు చెల్లాచెదరై పడి యుండుటను దారిలో నేలపైఁ బడియున్న పుష్పవర్షమును చూచి రాముండు దుఃఖితుఁడై దుఃఖముతో లక్ష్మణునితో ఇట్లనెను. 1014

అవియే యూపువు లంటు సీత కిపుడా నాటిత కేశంబులో
ఎ విశేషంబుగఁ దాల్చి నవ్వి ధరణిన్ కాలం క్షమా పూర్వ పా
యువులున్ ధ్వస్తము గాని యుల్లసిపియున్ యోగంబు శ్రీమంబు సీ
తవి తెల్పుంజుమి యుఁడుఁ బ్రస్రవణ భూధ్రం బెంచి [illegible]
1015

గిరిరాజా! వనిలో మదీయ ప్రియహస్నిం గుండు సర్వాంగ సుం
దరి యాసీతను నీవనిన్ గనితివే తద్వార్త వాక్రుచ్చు మం
చురు కోపంబునఁ బల్కి క్షుద్ర మృగము న్నుగ్రంపు సింహంబు మా
దిరి గర్జించి ప్రియున్ గనంబడవపై తేన్ సీతబల్ నూర్చెదన్. 1016

అని రాముండుఱుమంగఁ బర్వతము హేమాంగిన్ బ్రియున్ జూపి చె
ప్పనో యన్నట్టులు చూపకుండుతఱి రాముండిట్లనెన్ శైలమా
నిను నీచెట్టులతోడఁ గ్రొంబువులతో నే భస్మమున్ జేతు, సీ
తను నాకున్ వచియింప దానదిని తత్తం జేసి యొండించెదన్. 1017

ఇటులు రాముండు కంట దహించువాఁడు
వోలె నయి యటు రావణుం డాలతాంగి
నెత్తుకొనిపోవు నప్పుడు నిలను బడ్డ
రావణుని పెద్ద యడుగును రయము గాంచె. 1018

సీత భయపడి రాముకై చెంగి మిగుల
పరువు లెత్తుచు రావణాసురుని నుండి
తప్పుకొనిపోవఁ బడిన పదాల గురుతు
లాక్షణము రాము డారసె నచట బయట. 1019

అవల విఱిగిన వింటిని వమ్ముపొదిని
వలుగతులఁ జెల్లచెద రౌచుఁ బడిన రథము
భ్రాంత హృదితోడ రాముఁడు భ్రాత కపుడు
చూపి యిట్లనె భ్రాతతో నీవగిదిని. 1020

చూడు లక్ష్మణ! రాలిన పైఁడి పొడులు
సీత నగలు వల్ మూల్యముల్ చెదరె నిచట
పైఁడిపొడులఁ బోలిన నెత్తు రోడి పడిన
చుక్కలను ధరిత్రి తడిసి చూడఁ బడియె. 1021

తలతు లక్ష్మణా! కామ రూపులుగ నున్న
రాక్షసులచేత సీత శీఘ్రముఁగఁ జీల్చ
చీల్చఁబడి భుజింపఁబడెనొ చేరి పిదప
దొంగిలింపఁబడెనొ యేమొ తొరగఁ జూడు. 1022

అమ్మెకై ఘోరముగను పోరాడి నట్టి
యిర్వు రసురుల యుద్ధంబు నిచట జరగె
ముత్తెముల సరుల్ బంగారు భూషణములు
గల ధను సిది యెవరిదో భగ్నంబ యయ్యె. 1023

అసురులదో లేక ఘనులైన యమరు లదియొ
లలిత రవిఁ బోలి వైడూర్యగుళిక లొప్పు
పసిఁడి కవచ మెవ్వరదియొ భగ్న మౌచు
మహిని బడియుండి యొప్పు లక్ష్మణుఁడ! కనుము. 1024

శత శలాకలు దివ్యస్రజాలు గలుగు
గొడు గెవరిదో దండము చెడి పడియె భువిని
పసిఁడి కవచములు పిశాచ వదనములను
భయద తను వొప్పు ఖరము లెవ్వరివొ కూలె. 1022

మండు నగ్నిఁ బోలి ద్యుతుల నిండిపోరి
ధ్వజ మలరు యుద్ధరథ మిదెవ్వరిదొ కూలె
రథపు టిరుసుల వంటి పరాలు పైఁడి
నగలఁ దగిపడె, నేదైత్యనాథు నిదియొ. 1046

చూడు లక్ష్మణ! శరపుంలు కూడియున్న
యమ్ములు పొదు లిపి ధరిత్రిపైం బడెను
కేలితోం గొరడాయుం గళ్ళెలు బాప్పు
భువిని బడియున్న సారథి యెవని వాండొ. 1027

సారథిని జంపిన మహాబల సహితుం డెవండు
పురుషవర! చామరంబులు కరములందు
వ్రేల తలపాగ మణికుండలాలు వాల్చి
అనిని బడిన చామరధారి వనిత లెవరు. 1028

స్పష్టముగ నిది యెట్టి రాక్షసుని పదము
ఇతర జీవితము లనంత మెనయం జేయు
ద్వేష మిది నేను వారితోం బెట్టుకొంటి
అందుకే యిన్ని కష్టము లందుచుంటి. 1129

సౌమ్య! కామరూపు లగురాక్షసులు సకట,
జానకిని దీనను దినిరో చంపి రొక్కొ
ఈ మహావనిన్ సీత హరింపం బడెనొ
జానకిని ధర్మ మది ప్రోవం జాల దయ్యె. 1030

జానకిని ధర్మమే ప్రోవం జాల నపుడు
ఆమెను భుజించి హరియించి నప్పటికిని
అనుజ! లోకములో నాకు నప్రియుంబు
ఈశ్వరులు గాని యెట్లు గావింపం గలరు.

అన్న! లక్ష్మణ! గుణమును నన్నుం బొంది
యయ్యె దోషము; చూడు నాయఖిల కరుణ
గుణములను ద్రోసి యెల్ల ప్రాణిని నసురుల
వణతు; రవివెన్నెలను ద్రోసి యణంచుం దమము. 1032

యక్షులునుగాని గంధర్వులైనఁ గాని
రాక్షసులు పిశాచములును ప్రాణులెల్ల
కిన్నరులును మనుష్యులు గాని క్షేమ మేమి
పొందఁజాలరు నాశక్తిముందు చూడు. 1032

కనుము లక్ష్మణ! నాయస్త్ర గణముతోడ
ఆకసం బంతయును గప్పి యాక్రమించు
మూఁడులోకాలఁ జరియించు బుధుల నెల్ల
అఖిల సంచారములనుండి యాపివైతు. 1033

చంద్రసూర్యుల గతిని ధ్వంసంబు చేతు
గ్రహగతుల నడ్డెదనునగ్నిఁ గాని యడఁతు
గిరులఁ గూల్చెదఁ గాల్చెద తరుల; నబ్ధి
సరసు లడఁతు త్రిలోకనాశంబు చేతు. 1034

క్షేమముగఁ బియన్ నాకప్పగింపరేని
ఇప్పు డీక్షణంబున నింక నీశ్వరులును
లక్ష్మణా! గాంత్రు నాదు పరాక్రమంబు
అన్ని భూతా లెగిరిపోవు నాకసమున 1035

చూడు లక్ష్మణ ! నా వింట వీడఁ బడిన
బాణతతిచేత మృగములఁ బక్షితతుల
ధ్వంస మొనరింతుఁ జూడు ప్రపంచమెల్ల
తల్లక్రిందులౌ నటు చేతు వల్లకాడు. 1036

శ్రవణముల దాఁక బాణముల్ లాగివైచి
సీతకై నేఁడు వెంటనే జీవజగతి
సర్వ మపిశాచముగ నరాక్షసముగను
జలిపివైచెదఁ జూడు లక్ష్మణ ! క్షణాన. 1037

ఉగ్రముగ నా వలనను ప్రయుక్త మౌచు
మిగుల దూరముగాఁ బోవు మేలివాఁడి
బాణముల బలము వడి దేవతలు నిపుడె
చూచెదరుగాక లక్ష్మణ! చూడు మిపుడె. 1038

నా యలుకచేఁ ద్రిలోకముల్ నాశమొంద
దేవతలుగాని రాక్షసుల్ దితిజులేని
ఆ పిశాచాలు జీవాల నమరి యుండఁ
జాల రీలోకమందు లక్ష్మణ! క్షణాన! 1039

జానకి హరింపఁబడినఁ జంపఁబడిన
నాకు నప్పగింపరయేని లోకపతులు
సర్వ జగములు హద్దులు చనెడు నటుల
చేసిపైతు లక్ష్మణ విమర్శించి చూడు. 1040

అట్టి సీతను ప్రేయసి నప్పఁజెప్ప
లేని ఈ చరాచర లోక మిపుడుఁ గూల్తు
అనుచు రోషమునను నెఱ్ఱనైన కండ్ల
పాముపంతి ధనుసున్ పాణిఁ బట్టి. 1041

వింట శరమును సంధించి వీరుఁ డైన
రాముఁడు యుగాంత వహ్నియట్లును, దహింపఁ
జూచుచును నిట్లు మరియును జొచ్చి యల్కి
శీఘ్రముగఁ బల్కె లోకమున్ చెంతఁ జూచి. 1042

సర్వభూతంబులకు నవశ్యంబుగాను
వచ్చెడి ముసలితనము దైవమును మృతిని
కాలమును నివారింపఁగఁ జాల నట్లు
క్రుద్ధుఁడ నగు నేదుర్నివారుండఁ జుమ్మి. 1043

మున్నె యన్నట్లు సుదతిని నన్ను మిన్న
సీత నిప్పుడ నాకప్పఁ జెప్పకున్న
దైవ గంధర్వ నరపన్న గావృతంబు
జగతి సెల్ల క్షణములో నాశంబు చేతు. 1044

—: లక్ష్మణుఁడు రాముని శాంతపఱచుట :—

వ. అట్లు సీతాపహరణముచే క్రుక్కి బాధపడుచు ప్రళయాగ్నివలె లోక నాశమునకై యేర్పడిన ధనుస్సుపైపు చూచి నిట్టూర్పుచు ప్రళయకాలమున హరునివలె జగమును దగులబెట్టఁ దలంచుచు, [illegible] చూడరాని రాముఁడు క్రుద్ధుండుకాఁగా లక్ష్మణుండు ప్రాంజలియై వెలవెలఁబోయి యుండిన ముఖముతో నిట్లనియె. 1045

ఇందునియెడ లక్ష్మియు, రవి
యందును కాంతియును, గాలియందు గతి, భుపం
బందును క్షమయును మఱి నీ
యం దుత్తమకీర్తి కూడ ననయం బుండుస్. 1046

వ. కాన నొక్కరు చేసిన యపరాధమునకై లోకములను జంపితి వను నపయశము పొందఁ దగవు. సంగరమున కుపయోగించెడి ఆయుధములతోను పరికరములతోఁ గూడిన యీరథ మెవ్వరిదో విఱిగి యున్నదే. ఈ ప్రదేశ మంతయు డెక్కలచేతను రథపుఁ బట్టాలచేతను నలిగిపోయి నెత్తురు చుక్కలచేఁ దడిసి యున్నదే. ఇక్కడ ఘోరమైన యుద్ధము జరిగి నట్లున్నది. రాజకుమారా! ఇది యొకరివల్లనే జరిగిన సమ్మర్ధము. ఇద్దఱది గాదు. వాక్య చతురా! ఇటు మహాబలమునకు సమయము వచ్చినట్లు గనఁబడదు. ఒకరికై లోకములను నాశము చేయఁ దగవు. 1047

జనపతు లెపుడు మెత్తని
మానసు లగుచు శాంతు లగుచు మాన్యపు దండం
బును చేయుచుందు, రటు నీ
వు నఖిల భూత శరణ మయి పూజ్యపు గతివౌ. 1048

వ. రామా ! నీభార్యనాశమును ఎవరు మంచి దని యందురు. 1049

నదులును సముద్రములు దే
వ దైత్య గంధర్వు లెపుడు- వ్రత మహాత్మ యా
బుధు నికి సాధువులువలెను
ఎవియేన్ జేయఁ గలరె యీక్షితి నీకున్. 1050

ఎవ రాసీతను దొంగిలించిరొకొ యన్వేషింపఁగా నర్హమౌ
వివిధం బైన గుహల్ నదుల్ జలధులున్ పృథ్వీధరంబుల్ వనుల్
దివి గంధర్వజగాల్ ఋషుల్ మనమః నెంతేఁ జూచి గాలింత మిం
క వధూచోరుని; నామె సామనిడ రా? గన్గొంద మాయీశులన్. 1051

అవలఁ గోసలేశ! యిఁకఁ జేయంగఁ దగిన
పని యెదో చూతము నయాన వినయమునను
సామచే శీలమున నిప్పు డామె గనని
యెడల వజ్రాభ శరముల నేసి దునుము. 1052

—: రామునికి లక్ష్మణుఁడు హితము చెప్పుట :—

అటులు శోకముచేఁ దప్తుఁడై యునాథుఁ
డట్లు విలపించుచు మహావ్యథార్తుఁ డగుచు
చిత్తమే చన్న రాముని జేరి కాళ్ళ
పట్టుకొని యూరడించుచు భ్రాత పలికె. 1053

ఘనతపము చేసి ఘన మ
యిన కర్మలు చేసి రాజయిన దశరథుండున్
నిను రామా! పొందెను ఆ
ఘనులగు నమరు లమృతంబు పొందిన యట్లున్. 1054

నీ గురువు దశరథుం డో
నీ గుణముల బద్ధుండయియె నీ విరహమునన్
దేవత్వంబును పొందెను
నీవిది భరతుండు చెప్పె, నిది వింటివిగా 1055

ఇటు సంభవించిన వ్యథను
నిటు నీవే సైపఁజాలవేనియు నింకన్
ఎటు సామాన్య లబలలును
ఇటు సైపంగలరె యన్న యిట్టివి రాఁగా. 1056

శోకార్తుఁడ వగు నీవిటు
లోకములన్ దేజస్సుచేత లోఁ గొని కాల్చన్
శోకార్తులైన జనములు
నేకడకున్ జని ముదంబు నెనయుదు రనఘా! 1057

ఊరడిలుము నరవర! యె
వ్వారికి నాపదలు వచ్చిపడ లేదా ర్తిన్
మారుతమున నగ్నివలెను
చేరు, క్షణములో నవి వడి పోవున్. 1058

లోక స్వభావమే యిది
వీఁక నహుషసుత యయాతి వెస నింద్రునితో
సాలోకత గని, మఱియా
లోకమునుండి చ్యుతుఁ డయ్యె లోఁ జెడు పోకన్ 1059

లోకములకు జనని యగుచు
లోక నమస్కృత యగుచును లోకస్తుతులన్
చేకొను భూమాతయు ఓ
లోకస్తుత! చలన మొందు లోకములోనన్. 1059

లోకాలకు నేత్రపు లయి
లోకస్థ దర్శన ప్రవృత్తి లోపల గడు నా
లోకించెడి చంద్రార్కులు
లోకంబున గ్రహణమునకు లోఁబడుదురుగా. 1060

ఘన భూతంబులు దేవులు
ఘను లైన మహాపురుషులు ఘను లయ్యును ఓ
ఘన పురుషా! దైవమునకు
నన యుంబును వశులె యగుచు నందెద రార్తిన్. 1061

సురపతి లోనగు దేవులు
తలచుగ సుఖదుఃఖములకు తగ లోఁ బడుటన్
ధరలో విందుముగద యో
నరవర! నీవిట్లు కుంద న్యాయం బగునే. 1062

అనఘా! జానకియు నశిం
చినను హరింపఁగబడినను చింతను నీవున్
గనరాదు సుమీ పామర
జను డటు లెన్నటికిని శూర సన్నుతచరితా. 1063

సతతము సత్యము చూచుచు
క్షితి యుక్తాయుక్త తత్త్వచింతనఁ దగి స
న్మతి గల నీవంటి ఘనులు
సతి కష్టంబుల యందు నైన వ్యథ పొందరుగా. 1054

వ. ఓనరశ్రేష్ఠా! తత్త్వమును బుద్ధితో నాలోచింపుము బుద్ధి గల మహా ప్రాజ్ఞులు శుభాశుభములను ఎఱుఁగుదురు. గుణదోషములు ప్రత్యక్షముగాచూడ నట్టియు ఇది చేసితినని నిశ్చయింప శక్యముగాని కర్మలను తత్తత్పురుష వ్యాపారము లేకుండ నివృత్తి కలుగదు రామా! నీవును నాకు పూర్వము ఇట్లు చెప్పితివి. సాక్షాత్తు బృహస్పతి కూడ నీకు శిక్షణ ఇవ్వలేడు. మహాప్రాజ్ఞ! నీ బుద్ధిని దేవతలు గూడ పొందలేరు, శోకముచే నిద్రించిన నీజ్ఞానమును మేలు కొలుపు చున్నాను. ఓ ఇక్ష్వాకులశ్రేష్ఠా! దివ్యమును మానుషమును నైన నీ పరాక్రమమును దెలిసికొని శత్రువధకు ప్రయత్నింపుము.అందఱనుచంపుట వలన నీకేమి లాభము గలుగును. నీవు ఆశత్రు లెవరో తెలిసికొని దారిని పెల్లగించి వేయుము. 1065

—: రామలక్ష్మణులు జటాయువును జూచుట :—

అన్న యయ్యును లక్ష్మణుం డనిన సూక్తి
సారము గ్రహించు రాముఁడు సరి గ్రహించి
ఆగ్రహంబును లోననే నిగ్రహించి
చిత్ర మగు పల్లు దించి వచించె నిట్లు. 1066

ఏమి చేతము తమ్ముడా! యెటకుఁ బోద
మేయు పాయాన సీత నీక్షింత మంచు
మన జనస్థానమె మనము కనుద మింక
అరిగి యన్వేషణము చేత మనియె భ్రాత! 1067

పెక్కు రాక్షసు లుందురు పెక్కుతరులు
పొదలు గిరి దుర్గములు దరుల్ పొలుచు
తగు మృగము లున్న గుహలు గంధర్వ కిన్న
రాలయము లొప్పు వెదకుద మందు మరల. 1068

నిన్నుఁ బోలి బుద్ధిమంతులు నియమితాత్ము
లావనిఁ గనరు నాలి నద్రులట్లు
అనుచు లక్ష్మణుం డన రాముఁ డపుడు వింట
శరము సంధించి యావనిఁ దిరిగి చూచె. 1070

ఇంక గిరివోలె నున్న పక్షీంద్రు భువిని
పడిన యాజటాయువు రక్తపక్షుఁ గాంచి
వీడె కండా జానకిని మ్రింగి పృథివి గృధ్ర
రూపమునఁ బడియుండెఁ జూ ధ్రువము చూడు. 1071

ఆవిశాలాక్షి సీతను నపుడె తినియు
నెలమిఁ బడియున్న వీని వధింతు ననుచు
వింట శరము సంధించి యాపృథ్వి నుదుర
ననఁగ నెత్తుర గ్రక్కి జటాయు వార్తి బలికె. 1072

ఓయి దీర్ఘాయు: యెవతను నోషధిబలె
వెదకుచుంటి వామెను నాదు బ్రదుకు, రెండు
రావణుఁడు హరియించె: రాక్షసుండు
సీతను హరించుచుండ నీక్షించినాను. 1074

సీతఁ గాపాడ నెదురయి చేరినాను
రావణుని యుద్ధరథము ఛత్రంబు భువిని
పడఁగఁ గొట్టి విల్లు విరిచి వైచి సూతుఁ
జంపితిని రామ! నిటు నేను శ్రమను నలసి.

రావణుఁడు కత్తి గైకొని రయము గాను
నాదు రెక్కల నఱకి జానకిని నెత్తు
కొనుచు నాకాశ మార్గానఁ జనియె; మున్నె
రావణుఁడు చంపె; నను జంప రాదు మరల. 107

దాని రాముండు నాలించి బాష్పపూర్ణ
ముఖుఁ డగుచు సీతఁ గూర్చిన ముఖ్యవార్త
నెఱిఁగి గృధ్రరాజును గౌఁగిలించుకొనియు
ధనుసు పడవైచి భువిని తత్‌క్షణమె పడియె. 1076

అవశుఁడై భూమి నటు పడి యనుజుతోడ
ధీరతరుఁ డయ్యు రెట్టింపు మీఱు వ్యథచు
ఏడ్చి యెగయూర్పు దిగయూర్పు లెగయు నూర్చు
నాజటాయువుఁ గని యన్న యనుజుఁ బలికె. 1077

ఘనమగు రాజ్యమె పోయెను
వనవాసము వచ్చె సీత ప్రణయిని పోయెన్
ఘనుఁడు జటాయువు చనిపో
యె నిట్టిది యలక్ష్మి యగ్నినేని దహించున్. 1078

సకలం బగు నంబుధిని ఎు
నుక లాడుచు దాటు, మైనను జన విక పాపాల్
సకలం బగు నంభోనిధియు
వికలం బయి యెండు నాదు వికటాలక్ష్మిన్. 1079

లోకం బెల్లను వెదకిన
నాకంటెను నింత గొప్ప నాశిత భాగ్యం
బేకడ నైనను దొరకఁడ
నాకిటుల ఘనమయిన వ్యసనపు వల వచ్చెన్. 1080

వ. ఇదిగో చూడు ముదుసలి యైన గృధ్రరాజు నాతండ్రి స్నేహితుఁడు నాదౌర్భాగ్యముచే దెబ్బ తిని భూమిని పడియున్నాఁడు" అని రాముండు వచి యించి పలుసార్లేడ్చు జటాయును తాకి పితృస్నేహమును జూపుచు. 1081

ఱెక్కలు తెగిపడి నెత్తురు
మిక్కిలి దడిసి భువిఁ బడిన మేటి జటాయున్
నెక్కొను జనకుని మైత్రిని
నెక్కువ గని ప్రియ యేది యని యేడ్చియుఁ గూలెన్. 1082

పుడమిని ఖల రావణుచే,
బడఁ గొట్టఁబడిన జటాయుఁ బడెపదె గని రా
ముఁ డనుజుఁ బిలిచె జటాయువు
నొడలు నిమిరి కౌగిలించి యొగి జాలిమెయిన్. 1083

నిజముగ నాకొఱ కయి యీ
ద్విజము జటాయు విటు పూని దితిజ హతంబై
త్యజియించెను నిప్పుడ దు
స్త్యజ మగు తన ప్రాణములను తమ్ముఁడ! కంటే. 1084

ఇంకను దీని శరీరము
వంకఁ గనుమి ప్రాణ మింక వదలదు దీనిన్
శంకయె లేదిట స్వరము వ
ణంకియుఁ గన్పడుఁ బయికి మనలఁగనసాగెన్. 1085

నాయన! జటాయు! యిప్పుడు
పాయక చెప్పఁ గలవేని పచియింపుమి నా
ప్రేయసి సీతను గూరిచి;
నీయెడ శుభ మవుతఁ గొట్టె నిన్నెటు లతఁడున్. 1086

సీతను రావణు డెందుకు
నీతఱిఁ దీసికొనిపోయె నే యపరాధం
బాతనికి నేను జేసితి
నాతఁడు ప్రియఁ దీసికొని పోవు నంతటి దానిన్. 1087

విమలేందుముని జోరెడి యా
మె మనోహర వదన మెట్టి మెయి నపు డుండెన్
ప్రమదయు జాన మటి యా
సమయంబున నేమి పలికె సరిగాఁ జెపుమీ. 1088

ఆరాక్షసుఁ డెట్టి మహా
వీరుఁడు, తత్ప్రతాప మెట్లు వెలయును, నాతం
డేవిధముగ నేకర్మలు
గావించును, వాని గృహంబు కల దెచ్చోటన్. 1089

అటు విలపించుచు దీనత
నటు ప్రశ్నించుచును నున్న యారాముని పై
పటు గని హీనస్వరమున
జటాయు వారాముతోడఁ జటుకునఁ బలికెన్. 1090

దనుజేంద్రుఁ డగు నారా
వణుఁ డాజానకిని గగన పథిని పవన దు
ర్దిన సంకుల మగు మాయను
గొని వేగమె యుపహరించెఁ గ్రూరుం డగుచున్. 1091

కడు నాయాస పడిన నా
నిడుదగు ఱెక్కలను నఱికి నీప్రియ సీతన్
పడఁతిని దీసికొని మిగుల
వడి దక్షిణదిశ మొగ మయి వరువుం దీసెన్. 1092

కడ తేఱుచుండె ప్రాణము
లెడనెడ సృష్టియు భ్రమించు నిదిగో రామా!
* వడిఁ బసిఁడి చెట్లు గాంతును
కుడి యెడమల వట్టి వ్రేళ్ళ కురులన్ జూతున్. 1093

* పసిడి చెట్లు, వట్టివ్రేళ్ళ కురులును జూచువారు చనిపోవుదురనిశకునజ్ఞులు

ఆతఁడు విందపు మూర్తం
బౌతటిఁ బియుఁ దీసికొనుచుఁ బరువున్ డిసెన్
ఆతటిని నష్టపోయిన
ప్రీతికరధనంబు స్వామి వేగమె పొందున్. 1094

అది రావణునికిఁ దెలియదు
గద, కావున నపుడుఁ గాంతఁగని కొనిపోయెన్
పదపడి యసురుఁడు గేలము
నెద గొనుమత్స్యమువలె నశియించును త్వరగా. 1095

జనకజను గూర్చి నీవును
వనటం బొందకుము నీవు త్వరగా దైత్యున్
పనిపి యము మందిరమునకు,
జనకజ తోడ విహరింతు సత్వరమింకన్. 1096

రామునితో నిటు పల్కుచు
వ్యామోహము పొంద నట్టి పక్షీంద్రునికిన్
ఆమృత్యువుతటి మోమున
నామిషమును గలిసి నెత్తు రట ప్రవియించెన్. 1097

ఆవిశ్రవసుని పుత్త్రుడు
* ఆవైశ్రవణుని యనుజుడు సాక్షాత్తుగనా....................
ఈవిధిఁ బలికి జటాయువు
వేవే దుర్లభ మసువులు విడిచెను కష్టా ! 1098

---

* "విందపు" ముహూర్తమున పోయినది. దొరకును అని శాస్త్రము, కాన సీత దొరకునని భావము.

* రావణుడు సీత గైకొని వేవేగమెపోయి లంక వేగమె చేరెన్ అని చెప్పఁబోయి పక్షి చెప్పలేక మరణించెను.

చెప్పు చెప్పని రాముఁడు చేతు లొగ్గి
పలుకుచుండ జటాయువు ప్రాణములను
పక్షి మేనును వీడి యభ్రంబు చేర
పక్షి కాళ్ళను తల వాల్చి పడెను భువిని. 1099

రాక్షసుల భూమి నింత కాలంబు పోయి
బ్రదికి, దండకాటవి నేడు పక్షి పోయె
చాల యేండ్లుగఁ జిరముండి కాల మింక
తీరఁ బోయెఁ, గాలము దురతిక్రమంబు. 1100

అతి వీర్యం బగు రావణాసురునితో నాసీతకై పోరుచున్
పితృ పైతామహ మైన రాజ్య మసువుల్ వేగంబ కోల్పోయి, యీ
క్షితి నాకై యుపకారమున్ జలిపె పక్షీంద్రుండు, సర్వత్ర యీ
గతి సాధుల్ శరణిచ్చువారు పశులంగాని కనన్ వత్తురిగా. 1101

వ. పక్షీంద్రుడైన యీజటాయువు నాకయి మరణించి నందువలన కల్గినంతగా సీతను హరించినందువల్ల నాకు దుఃఖము కలుగుటలేదు. మహాయశస్వియు శ్రీమంతు డగు దశరథుఁ డెట్లు పూజనీయుఁడొ యట్లె ఈపక్షిరాజును పూజనీయుఁడు, మాన్యుఁడును. సౌమిత్రీ! వెళ్లి కట్టెలను తెమ్ము. నేను నిప్పు మండించెదను. నాకయి చనిపోయిన జటాయువును దహనపఱచెదము. రౌద్రుడైన రావణునిచే హతుఁడైన ఈ పక్షిరాజును చితిపైని ఉంచి దహించెదము. యజ్ఞశీలురకు ఆహితాగ్నికి పరివ్రాట్టులకు భూదానము చేసినవారి కెట్టి గతి గలుగునో అట్టి గతియు వీనికి కలుగునుగాక. ఓ మహాసత్త్వా! గృధ్రరాజా! నాచే సంస్కరింపఁబడి నాచే ననుమతింపఁబడిన వాఁడవై ఉత్తమ లోకములను పొందుము. అని పలికి ధర్మాత్ముఁడైన రాముండు దుఃఖితుఁడు తన బంధువునువలె చితిపయిని బెట్టి దహించెను. పిదప రాముఁడు లక్ష్మణునితోఁ గూడ అడవిలో స్థూలములైన మహామృగములను జంపి అపక్షిని తృణమును దర్భలను బఱచెను. అమృగమాంసమును ముద్ద చేసి అవచ్చని పచ్చికపైని

శకునములకు పైచెను. చనిపోయిన మనుజునికి వలె ఆపక్షికిని మంత్రములు
పఠించి రాముఁడు పితృకర్మను జరపెను. పిదప గోదావరిదగ్గఱకు వెళ్ళి నది
యందు స్నానముచేసి ఆగృధ్రరాజునకు వారు శాస్త్రప్రకారముగా నీళ్ళు వద
లిరి. ఆపిదప మహర్షి తుల్యుఁడైన రామునిచే నాగృధ్రరాజు సంస్కరింపఁబడి
పుణ్యలోకమునకు వెళ్లెను. ఆరామలక్ష్మణులును పక్షిరాజునెడ స్థిరబుద్ధి యుంచి
మరల సీతను అన్వేషించుటకై సురేంద్రుల్లైన విష్ణుదేవేంద్రులవలె వనముఁ
బ్రవేశించిరి. 1102

## —: కబంధుఁడు రామలక్ష్మణులఁ బట్టుకొనుట :—

ఇఁక నాపక్షికి రామలక్ష్మణులు నీళ్ళిరితి నర్పించి జా
నకి నన్వేషణ చేయ నైరృతిదిశన్ బైల్దేరి వృక్షాల గు
ల్మకముల్ తీవెలు చుట్టుకొన్న బహుదుర్గంబౌ వనుల్ దాటి గం
డక శార్దూల భుజంగ సింహ మృగ గూఢారణ్యమున్ దాటియున్. 1103

చని యాపై నిఁక భ్రాత లిద్దఱు జనస్థానంబు శీఘ్రంబు దా
టినవారై యట మూఁడు క్రోశములు నూటిన్బోయి క్రౌంచాటవి
న్గని నానా ఘన పూర్ణమై ప్రమదమున్ బాటిల్లి యుండంగ నా
వని నానా ద్విజ సర్పజంతు యుత మొప్పం గాంచి రప్పట్టునన్. 1104

ఇటు సీతన్ గనఁ గోరి కాననములన్ వీక్షించుచందుండుఁ బ్రది
ప్పటచే నాగుచు నుండి పోవుచును తూర్పైపోయి యా భ్రాత ల
చ్చట క్రోశంబులు మూఁడు పోయి మఱి క్రౌంచారణ్యమున్ దాటిముం
గట వీక్షించిరి జంతు సంతత మతంగాఖ్యాశ్రమం బచ్చటన్ 1105

వ. మఱియు నా యాశ్రమంబు దాటి భీకర వ్యాళ కీర్ణంబైన
యొక్క మహారణ్యమును జూచి దానికి 1106

దరిఁ బాతాళ గంభీరమై యిరుల నత్యంతంబు గాఢాంధకా
దరిఁ వీక్షించియు దాని దగ్గఱనె రౌద్రాకారమై తీక్ష్ణ దంష్ట్రాకృతి భీ
కర లంబోదరి భీకరరాస్య యగుచు యుగ్రప్రాణులందించుచు వెస్
కురు లల్లాడఁగ నొప్పు రాక్షసిని నొక్కర్తున్ జూచిరా సోదరుల్. 1107

అది యారాక్షసి రాము ముందరుగు శుద్ధాచారు నా లక్ష్మణున్
గదియం బట్టియు రా సుఖింత మని బిగ్గన్ గ్రుచ్చి వాక్రుచ్చె నీ
యదిరా భాగ్యము నేనయోముఖిని నీవంటేఁ ప్రియుం బడ్సె ఈ
బ్రదుకున్ శైలతలాల నేటి పులినాలన్ హాయిఁ దేల్చింతసే 1118

అని యారాక్షసి పల్క లక్ష్మణుఁడు క్రోధాటోప మేపారఁగ న
త్తిని బైకెత్తి నిశాటి ముక్కు చెవిచన్దిండ్లిట్టి ఛేదింప వ
చ్చిన దారిం బడియార్చుచున్ బరుగుదీసెన్ రాక్షసస్త్రీ యటంచే
మన సౌమిత్రియు రాముఁడున్ చని చగమూప్రవ్య మహౌజస్సుతో. 1109

శుచియున్ కాలము గల్గు లక్ష్మణుఁ డిఁకన్ శోభాఢ్య తేజస్సుతో
రుచి చూపం గల రాముఁ గాంచి కరముల్ జోడించి వాక్రుచ్చె న
న్నా! చలించెన్ గడు నాభుజంబు, నిదిగో నాచిత్త ముద్విగ్నమై
పచరించెన్ మరి దుర్నిమిత్తములుకన్పట్టున్ జుమి యిద్యోడన్. 1110

కనుకన్ సిద్ధముకమ్ము యన్న! హితమౌ క్రమంబులో వాక్యముల్
విని కావించు నిమిత్తముల్ భ్రమము గొల్పెన్ శ్రద్ధగా నుండు దా
రుణమౌ వంజులకాఖ్య పక్షి మన గెల్పున్ మంచి సూచింపఁ గూ
సె ననన్ పిమ్మట వారి కప్డు వినిపించెన్ ఘోరమౌ నాదముల్. 1111

ధ్వను లేతెంచిన వైపు చూచిరి పొదన్ వారల్ కబంధున్ శిరం
బును కంఠంబునులేక పొట్టను ముఖంబున్ పైకి మైలేచు రూ
క్షణ రోమంబులు కాలు మేఘు మటు లుగ్రంబైన నాదంబు న
గ్నిని మంటల్ విరఁజిమ్ము కన్ను నుదుటన్నిండారె నవ్వానికిన్. 1112

కనుఱెప్పల్ కడుఁ బెద్ద దంష్ట్రలు మహోగ్రంబై తనరన్, వక్త్రమున్
ఘనజిహ్వాగ్రముచేత నాకుచును ఋక్ష వ్యాఘ్ర సింహ ద్విపా
లను భక్షించుచు యోజనంబు పొడవై బ్రాజిల్లు హస్తంబులన్
పెనుజంతుల్ విహగాల లాగుచును నొప్పెన్ తత్కబంధుండనన్. 1113

దరిగా వచ్చిన రామలక్ష్మణుల యాహారిన్ గరం బాక్రమిం
చి రయానన్ బహు ఘోర దర్శనత నుజ్జృంభించి తేజో వప్
ర్ధరు లౌచున్ దృఢధన్వులౌచుఁ గరవాలాల్ దాల్చు వ్యాఘాత లి
ర్వ్వారఁ బట్టన్ ధృతి రాముఁ డంతట భయంబుం జెంద దేమాత్రమున్.
1114

ధృతి లేకుండుటఁ జిన్నయౌట భయమెంతేఁ బొంది సౌమిత్రియా
వెతతో రాముని బల్కె "రాక్షస వశంబే యౌ ననుం జూడు పే
మతి వీరా! నను వీనికిన్ వదలిపొమ్మా యొక్క నన్నిప్పుడీ
గతి వేగన్ బలియిచ్చి క్షేమముగ సౌఖ్యంబొందుఁ బ్రొత్తుమీ. 1115

అతి శీఘ్రంబుగ సీతఁ గాంతు వని నాస్వాంతంబు వాక్రుచ్చు మీ
పితృ పైతామహ రాజ్యముం బడసి పృథ్విన్ బ్రోచుచున్ నన్ను నీ
మతి నెప్డున్ దలపోయుఁ గాదగుదు వోమాన్యా! కనుంగొ"మ్మనన్
ధృతి రాముం డనె వీర! చింతిలకు మార్తిన్ త్వాదృశుల్ గాంతురే.
1116

ఇక దైత్యోత్తముఁడా కబంధుఁడు మహోత్కృష్ట ధ్వనిన్ వారితో
వికటుండై యనె మీరలెవ్వరో యసిన్ పెన్ విండ్లు చేఁదాల్చి నా
నికటక్షోణికి వచ్చి నాకు వశతన్ దృగ్గోచరం బైతి రెం
దుకు మీరల్ చనుదెంచి యీగతి క్షుదార్తుండైన నన్ బొందిరే. 1117

శరముల్ విల్గొని తీవ్రశృంగములతో సౌరొప్పు నెడ్లంబలెన్
దరికిన్ వచ్చియు నాదు నోటబడి రింతన్ మీరు జీవించుటే
యరుదౌ నంచు వచింప దుష్టమతియౌ నాదైత్యు వాక్యంబు లా
తతి నాలించి ముఖంబు వాడ ననెఁ దత్సౌమిత్రితో రాముడున్. 1118

ప్రియుపోవన్ వ్యథ మీఁదటన్ వ్యథయు బ్రాప్తింపంగ ఘోరంబు లి
మ్మెయిఁ గల్గెన్ రఘువీర! యిట్లు కనుగొమ్మీ సర్వభూతాళి నీ
పయి ఏబాధ్యత లేదు దైవమున కిప్డెఁ గష్టముల్ పొంది నేం
తయొ వ్యామోహము గన్నయీ మనుయవస్థల్ చూడుమీ లక్ష్మణా 1119

బలవంతులు శూరులు నిపుణా
స్త్రులయిన వారలును గూడఁ దొరగా నాజిన్
ఇల కాలమునకు వశులయి
పలు బాధలు కనెద రిసుక పంతెన లట్లుల్. 1120

అని యపుడు మహాయశుఁడును
ఘన సత్య పరాక్రముఁడును గరము ప్రతాపం
బు నుదగ్ర పౌరుషము గల
మన రాముఁడు స్వమతి నాత్మ మహితుం డయ్యెన్. 1121

బాహువులచేతఁ బట్టుకోఁ బడిన భ్రాత
లిద్దఱను జూచుచుఁ గబంధు డిట్టు లనియె
ఆకలిగొను నన్ను నృపాగ్ర్యులార! యేమి
కనెదరు మిము దైవమె నేను దినఁగఁ బంపె. 1122

అన విని యార్తిఁ బొందియును ప్రాప్త పరాక్రముఁ డౌచు, వీఁక ల
క్ష్మణుఁ డపుడేమిచేయు హితమౌనొ మతిం గని యిట్లు పల్కె, ని
న్నును నను రాక్షసాధముఁడు నొప్పఁగఁబట్టెను, వాని గొప్ప కే
లును, వడిఁ గత్తిచే నఱికి లోకము నిర్భయముంబొనర్తమే. 1123

ఘనతను పూనె రాక్షసుఁడు కాని యచేష్టుని యాగ బాహ్య జం
తునుబలె రాజు చంపఁదగదున్గదె యుం చన నాలకించి నో
రును గడు దైత్యుఁడున్ దెఱచి క్రూరత వారి భుజింపఁ గోర వా
రును వెస దేశకాలము లెఱుంగుచు నుండిరి ధీరచిత్తులై. 1124

రాముఁడు వాని దక్షిణకరంబును వ్రక్కలఁ గొట్టి హర్షితన్
వామ కరంబు లక్ష్మణుఁ డవక్రపరాక్రముఁ డెంచి కొట్టె, నా
భీమ కబంధుఁడున్ బడి దివిన్ భువి దిక్కులు మారుమ్రోగఁగా
శ్యామల మేఘమట్లు ఱచి యార్తిని నీరసుఁబు మీరెసం బ్రశాన్. 1125

వ. శుభలక్షణుం డైన లక్ష్మణుండు వాని అమహాబలుం డైన కబంధునికి ఇట్లు చెప్పెను. "ఇతఁడు ఇక్ష్వాకు దాయాదుఁడు రాముఁ డని యందురు. వీని తమ్ముడను నేను. నాపేరు లక్ష్మణుఁడు. పిన్ని రాజ్యము హరింపఁగా రాముడు వనమునకు వచ్చెను. నాతోడను భార్యతోడను ఈతఁ డీవనమునఁ జరించు చుండెను. దేవ ప్రభావుఁడైన యితఁడు విజన వనమున వసించుచుండఁగా ఒక రాక్షసుడు ఈతని పత్నిని హరించెను. ఆమెను వెదుకఁగోరి యిటకు వచ్చితిమి. నీవెవ్వఁడవు, నీవెందుకు మొండెము మాత్రమే గలిగి యుంటివి. వక్షమున వెలుగుచున్న మొగముతో కాలి పిక్కలు విడగి పోవ దొర్లుచుంటి వేల అని యడుగ చాల ప్రీతిగలవాఁడై కబంధుఁడు ఇంద్రుని వాక్యముసు గుర్తుకు తెచ్చుకొని యిట్లనెను. "ఓనర శ్రేష్ఠులారా! మీకు స్వాగతము. అదృష్టవశముచే నేనిప్పుడు మిమ్ము చూచుచున్నాను. ఈబాహు బంధములు నాభాగ్యముచే తెగఁ గొట్టబడినవి. నే నేఅవినయము చేయుటచేత నాకీ విరూపము ప్రాప్తించెనో సరిగా చెప్పెద వినుడు. 1126

## — కబంధుఁడు తన వృత్తాంతమును జెప్పుట :—

మును రామా! పృథుబాహు! నేనిచట సోముం డట్లు శక్రుండిటుల్
ఇనుఁడుంబోలె త్రిలోక విశ్రుతము, నుత్కృష్టంపు రూపాన నుం
టిని నొక్కప్పుడు భీకరాకృతిని నేని ట్లరణ్యాన నుం
డిన మౌనీశుల భీతిగూర్ప విదవన్ వేగంబ యావేళనే. 1127

ఈవిగర్హిత దారుణాకృతియె నీకు
నడరెడి నని స్థూలశిరుఁ డనెడి మౌని
నాకు శాప మీయఁగ నేను నయము మీఱ
ప్రార్థన మొనర్ప నాతఁడీలాగు పలికె. 1128

ఎపుడు రాముఁడు కేలు ఛేదించి నిన్ను
విజన వని దహించునో కా యావేళ నీవు
నీదు శుభరూపు గనెదవు నీవు నన్ను
దను కుమారుఁగ నిపుడు లక్ష్మణ! యెఱుంగు. 1129

అపుడు శ్రీలతో రాజిల్లి యలరినాను
పిదప నింద్రుశాపమున నీవికృతి గలిగె
నేను తీవ్రతపము చేయ నెమ్మనమున
మెచ్చి బ్రహ్మ దీర్ఘాయువు నిచ్చె నాకు. 1130

అంత నాకు దీర్ఘాయువు నలరియుండ
నన్ను శక్రుఁ డేమి యొనర్చు నన్న ధృతిని
శక్రు నెదిరింప నతఁడు వజ్రంబు వేయ
తొడలు తలయు మేనునఁ జొచ్చి యడరె నిట్లు. 1131

అతని యాచింప నాతఁడు యముని యింటి
కనుప కపుడు బ్రహ్మనుడి సత్యంబ యగుత
అని పలుక నాకు నాహార మగును నేది
తొడలు విఱుగ దీర్ఘాయువు నడరు టెట్లు. 1132

అనుచు నేఁబల్క నింద్రుఁడు నపుడు నాకు
యోజనము పొడవగు చేతు లొసగెఁ గుక్షి
యందుఁ దీవ్రదంష్ట్రిలు మోము నమరఁ జేయ
నే దవుల నున్న పశుల భక్షింతు లాగి. 1133

ఎపుడు రామలక్ష్మణులను నేగుదెంచి
కరముల నణకెప రపుడె కనెదు స్వర్గ
మనియె రామ! ఈమేనితో వనిని నెల్ల
కాంచినవి లాగి తిను యోగ్యతయుఁ గలిగె. 1124

పట్టుపడును రాముండె యవశ్య మనెడి
బుద్ధితో దేహమును వీడఁబూని యుంటి
నరి యె నీవు రాముఁడవు, నన్ జంప నెవఁడు
శక్తుఁడేగాఁడ యని చెప్పె సరిగ మౌని. 1135

నేను * బుద్ధిసాయమ్ము గావింతు రామ!
మీవలన నగ్నిసంస్కార మావహింపఁ
బడియు మిత్రమై యుపదేశ మిడుదుఁ గూడ
ననఁగ రాముండు పల్కె లక్ష్మణుఁడు వినఁగ. 1136

నేను తమ్మునితో జనస్థానినుండి
పోయిగ నేగుచుండఁగ యశము గలుగు
సీత నా భార్య రావణుచేత పట్టు
కోబడియు నెందొ తీసుక పోఁబడెఁజుమి. 1137

వాని పేరె తెలియుఁగాని వాని రూప
మాతఁ డెటు లుండునో వాని యాప్రభావ
మేమొ వాని నివాసంబు నేదొ తెలియు
మిట్టి యీ యనాథులము మమ్మీవు గనుము 1138

* బుద్ధిసాయము=సలహాచెప్పుట.

ఆమెకై యార్తిఁ బరువెత్తు నట్టి మమ్ము
జాలి గని యుపకారంబు సలుపవయ్య
ఏనుఁగులు విడిచిన యట్టి యొండు కట్టె
లిపుడు తెచ్చి గోతిని నిను దహింతు మిచట. 1139

ఈవు సీతను గూర్చి వచింపఁ దగుదు
వెటకు నెవ్వఁడు హరియించి యేగెఁ జెప్పు
సరిగ తెలిసినచోఁ జెప్పి చాల శుభము
చేయు మని రాముఁ డడుగ వచించె నసుర. 1140

రామ! నాకు దివ్యజ్ఞాన మేమి లేదు
సీత నెఱుఁగను నను దహియించి నప్పుడేను
నాస్వరూపము పొంది జానకిని గూర్చి
యెఱుఁగు వానిని నీకు వచింతు నిపుడు. 1141

తగులఁ బెట్టక పూర్వము తగినరీతి
ఆయసురుఁ డెవడొ వాని యఖిలవార్తఁ
జెప్పఁజాలను శాపానఁ జెప్పుశక్తి
చనియె నిదె నేను నిటు తెచ్చికొనిన వికృతి. 1142

కాని సూర్యుఁడు గుఱ్ఱముల్ కరము బడలి
యస్తమింపకుండఁగ గోతియందు వైచి
నను దగులఁబెట్టు మెవఁడు దైత్యుని నెఱుంగు
వానిఁ జెప్పెద నిపుడె న్యాయరీతి. 1143

నేను జెప్పిన వానితో నవ్వు మైత్రి
న్యాయముగఁ జేయు నాతఁడు హర్షమొంది.
సులభ విక్రముఁడౌచు నిన్ జూచి సరిగ
సాయమును దప్పకయె చేయు నోయిరామ! 1144

మాఁడు లోకాల నాతఁడు చూడ నట్టి
దేమియును లేదు సుమి రఘురామ! యింక
వేఱు కారణమున కయి నెడలి మున్ను
లోకములఁ జుట్టి వచ్చెను నీకె తెలియు. 1145

—: సీత లభించు ఉపాయమును జెప్పుట :—

ఇట్లు కబంధుఁడు చెప్ప నరేశు లపుడు
గిరిని పగులును జూచి నిప్పరసి పెట్టి
రంత సౌమిత్రి మంటలు నసురుఁ జుట్టు
సలుప ఆమెద డాజ్యంబువలెనె కాలె. 1146

అతఁడు చితినుండి పొగలేని యగ్నివోలె
వలలి శుద్ధవస్త్రాలు దివ్యంపు మాల
దాల్చి వెలుగుచు హృష్టుడై తత్‌క్షణంబ
యాకసముపై కెగిరె భూష లన్ని దాల్చి. 1147

వ. అట్లు ఆకాశమందు భాసిల్లుచున్న హంసలు గల విమానమున ప్రభతో మహాతేజస్సు గల దిశదిశలను వెలిగించుచుఁ గబంధుఁ డిట్లనెను. రామా! వినుము వాస్తవముగ సీత నెట్లు పొందఁగలవో చెప్పెదను. రామ! లోకమున సంధి విగ్రహయానాసనద్వైధీ భావముల నాశ్రయించిన యుక్తు లాఱుఁ గలవు. వానితో నన్నియు విమర్శింపవలయును. 1148

ఉత్తమ స్థితినుండియు నూడి పడిన
వాఁడె యుత్తమ స్థితి పొందవలసియుండె
ఈవొ యుత్తమస్థితి పోవ హీనుఁడైతి
నదియు లేక భార్యయు పోవ వ్యసన మొగనె. 1149

అందుచే నీవు తప్పక యట్టిస్థితికి
స్నేహితుని పొందవలయును స్నేహితుండు
ఎంత శోధించి యత్నించి కూడ
స్నేహితుని మైత్రి చేయక సిద్ధిరాదు. 1150

నీవు వినుము చెప్పెదను సుగ్రీవుఁ డనెడి
వానరుఁడు గల, డాతఁడు భ్రాత యైన
ఇంద్రసుతుఁ డైన వాలి కోపించి గెంట
ఋష్యమూకాద్రిఁ బంప దరిగ వసించె. 1151

వానరుల నల్వురను గూడి బలము గలిగి
తేజమున నొప్పి వానరరాజె యనుచు
సత్యసంధుఁడై ప్రభ ధృతి సన్మనస్సు
గలిగి సుగ్రీవుఁడును శక్తి నలరి యుండె. 1152

అతఁడు రాజ్య నిమిత్తమై యన్నచేత
వెళ్ళఁ గొట్టఁబడియె యుండు వెళ్లి నీవు
వానితో మైత్రి చేయుము వాఁడు నీకు
సీత వెదకుటలో సాయమై తనరుచు. 1153

కావలసినది యెప్పుడున్ గాకపోదు
అది మఱొకరీతి చేయ శక్యంబు కాదు
కాలమును దాట నెవరి శక్యంబుకాదు
సలుపు సుగ్రీవుతో మైత్రి జ్వలను నెదుట. 1154

వానితో నగ్నిసాక్షికమైన మైత్రి
సలుప ద్రోహంబు చేయుట వలను పడదు
నీవలెఁ తిగఁ గపికు సుగ్రీవుఁ గనకు
కడు సహాయార్థి, కృతవేది కామరూపి. 1155

అతఁడు కోరిన కార్యము నాచరింప
నధిక శక్తులు మీరు, కృతార్థుఁ డైన
మఱియు నకృతార్థుడైనను మఱచి పోక
మీపనిని చేయు మానఁ డేమియును గూడ. 1156

అతఁడు ఋక్ష రజసు పుత్త్రుఁ డనయు మతఁడు
వాలిభీతిఁ బంపా సరోవరము దరిని
మెసలు చుండు సూర్యునికి నౌరస సుతుండు
వాలితో వైరమును బూని వఱలుచుండు. 1157

ఆయుధము సాక్షిగాఁ గూడ నప్పు డీవు
ఋష్యమూకాద్రి యందుఁ గపీశుతోడ
సత్యముగ స్నేహమును జేయు సర్వగతుల
మీకు సాయంబు చేయును మీర డెపుడు. 1158

అతఁడు రాక్షసు లుండెడి యన్ని చోట్లు
పూర్తిగా నేర్పుగాఁ జూచి పొందఁ గలఁడు
అతఁ డెఱుగని స్థానంబు లవనియందు
నెచటను లేవు సుమ్మి గ్రహింపు డెపుడు. 1159

వేల కిరణాలు గల రవి విశ్వ మెపుడు
కడు దహించునో యందాకఁ గందరముల
గిరుల నదులను గిరిదుర్గదరుల నెల్ల
కపులతోఁ జూచి నీపత్నిఁ గని యొఱుంగు. 1160

గొప్ప మేను గల కపులఁ గూడఁ బంపి
నీవియోగానఁ గుందుచు రావణాల
యమున నిర్మలమై యున్న యావరాస్య
వెదుకఁ గలఁడు నీదరికి రప్పింపఁ గలఁడు. 1161

ఊర్ధ్వ మేరుశృంగాగ్రాల నున్నఁ గాని
గూఢ పాతాళ తలములఁ గూడ నున్న
నీ ప్రియను వానరేశుఁడు నేర్పు మీర
నరసి దైత్యులఁ జంపి నీకప్పగించు. 1162

—: ఋష్యమూకపర్వతమునకు మార్గము చెప్పుట :—

సీతను వెదకఁగ నుపాయ భూతమైన
దంతఁ జెప్పి యర్థజ్ఞుఁ డౌకబంధుఁ
డప్పు డన్వర్థ మైన వాక్యంబు చూచి
యిట్లు రామునితో వచియించె నపుడు: 1163

ఇదిగో రామ! శుభంబె యైన పథ, మిందే చక్కఁగాఁ జూచి యు
న్నది యీకాన! ప్రతీచి దిక్కు మొగమై * న్యగ్రోధ జంబూ కదం
బ దవాశ్వత్థ ప్రియాళు చూత పనస ప్లక్షాగ్ని ముఖ్యాతి ము
క్త దవాశోక సురక్త ముఖ్య తరువుల్ గ్రాలన్ మనోజ్ఞంబగున్. 1164

* ప్రతీచి = పడమర, జంబు = నేరేడు, కదంబ = కడిమి, ధవ = చంద్ర, అశ్వత్థ=రావి, ప్రియాళు=మోరటచెట్టు, చూత=మామిడి, ప్లక్ష=జువ్వి, అగ్నిముఖ=జీడిచెట్టు, అతిముక్త=ఒక రకపు అశోకము, దవశోక=అడవి లోని అశోకము.

ఈ వర్ణనవలెనే కాళిదాసు మేఘసందేశమున వర్ణించెను.

ఆతరువుల నెక్కియొ వంచియైన నచట
అమృతమును బోలు ఫలముల నపుడు తినుచు
పోవుఁ డదిదాట నందనమును హసించు
వన మొకటి కన్పడును పాదపముల మించి. 1165

అట నుత్తర కురువులందుఁ బోలెను చెట్లు
నిఖిలకాలము తేనెల స్రవించు
అటఁ జైత్రరథవని నటు లెల్ల ఋతువులు
పండ్లు పాదపముల వంచఁ దనరు
అట మేఘగిరు లట్టు లఖిలవృక్షంబులు
అమృత కల్ప ఫలము లమరనిచ్చు
అటఁ గమలోత్పలా లమరు పుష్కరిణీ యా
పంపాసరసి సౌరభాల నీను

అందు చెట్లెక్కి ఫలముల నల్ల రాల్చి
లక్ష్మణుఁడు నీకు నమృత ఫలాల నిచ్చు
దేశముల దాటి గిరిగిరి దిగుచు నెక్కి
జాలి కిసుకయుండని పంప సరసిఁ గనుఁడు. 1166

అటు హంసల్ * కురరాలు కప్పలును రమ్యక్వాణముల్‌చేయు న
చ్చట నామర్త్యులఁగాంచి; చంపునరుఁగాంచంబోనియాపక్షులున్
ఎటకున్‌భీతిలిపాఱ వెప్పుడును; నందే నేతిముద్దల్ వలెన్
బటువౌ పల్ పెనుపక్షులన్‌గొని తినన్ వచ్చుంజుఁడీ యచ్చటన్. 1167

* కురరాలు = గోరువంకలు.

ఎఱ్ఱి చేపలు, చక్రాల సెసఁగు మీలు
రామ! నడమీలు పంపాసరస్సునందుఁ
గలుగు చేపలు శరములన్ గరము పట్టి
సరిగ నూచల కాల్చి లక్ష్మణుడ యిచ్చు. 1168

పంపలో మత్స్యముల వంటిపండ్లొ కూడ
తినుచుఁ బద్మగంధము గల్గి తీయు నగుచు
సుఖము చల్లన నిడి రుజల్‌చొరని స్ఫటిక
పటుజలము తామరాకుతో ద్రాత యొసఁగు. 1169

గిరిగుహలన్ బరుండి వనిఁ గ్రీవఁ జరించు వరాహ యూథమున్
తిరుగుచు నీకు లక్ష్మణుఁడు తిన్నగఁ జూపును సంధ్యవేళలన్;
మఱి జలమానఁ గోరి యటు మానక వచ్చియు ఱంకె లేయు ను
ద్ధుర వృషభంబులన్ బలెను దోఁచును నీకు మదించు మేనులన్. 1170

పువు లింపారెడి చెట్లు, పక్షులగణంబులిల్ కూయుఁ జెందమ్మి పూ
లవిలాసంబులు గల్గి పంపసరసిన్ రమ్య స్వచ్ఛ శీతంపు నీ
ళ్ళు విరాజిల్లగ నొప్పు దృశ్యములు, నాలోకించి సౌమిత్రితో
కలియం జొచ్చిన దుఃఖమున్ మఱతు వింకన్ రామ నీవెమ్మదిన్. 1171

అచటఁ బూవులతో నిండి యలరు తిలక
తరులఁ గానుగు చెట్లను విరిసి నట్టి
తామరపువుల, నీలియుత్పల సుమాల
నరసి నీపూర్వ శోకంబు మఱతు వపుడె. 1172

భువి నెవ్వండును పూలుకోయ; డవి యెప్డున్ వాడిపో: వెన్నఁ డెం
డవ యచ్చోట మతంగ మౌనికయి వన్యంబౌ పదార్థాలు తే
ర వనిన్ జేరి భరంబుచే నలయు ఛాత్రశ్రేణి దేహంబు నుం
డి వేసన్ రాలిన స్వేదబిందులును పూలే యాఁ దపశ్శక్తిచే. 1173

అట నామౌనులఁ గొల్చుచుస్ శ్రమణియై యత్యంతమున్ ధర్మమున్
పటుతన్ జేసి చిరంబుగా శబరి జీవాలూని-సర్వంబుచే
నిఖిలన్ మన్నన బొందు దేవసము-నిన్నే చూచి స్వర్గంబు పొం
దుటకై వేచియు యుండె, నా శబరి నిన్నుం జూచి చేరున్ దివిన్. 1174

ఇఁక బంపాతటిఁ బశ్చిమాభిముఖమై యేపారు గుప్తాశ్రమం
బొక టద్దానిని నాక్రమింపగ గజాలోర్వంగ లేవైనఁ గా
ని కమున్ నాగము లెన్నొ యూనగముపై నిండున్ మంతగర్విచే
నికట క్రోణి యుటన్ మతంగవన మన్ పేరన్ సువిఖ్యాతమౌ. 1175

నందన వనంబుఁ బోలియు
సుందర దేవవనమువలెఁ బొప్పగు వనిలోఁ
గ్రందుగ వివిధ విహంగము
సుందర మగుచోట్లఁ బొచ్చి సుఖియింతువులే. 1176

పంప సరసికి ముందటఁ బాదపములు
పూలతో నిండు, నట ఋశ్యమూక ముండె
అది దురారోహము శిశునాగాభిరక్షి
తంబు మును శ్రేష్ఠముగ బ్రహ్మ తగ సృజించె, 1177

అట్టిగిరి శృంగమునఁ బండినట్టి నరుఁడు
కలను గన్న విత్తమును మేల్కొనియుఁ బొందు;
చెడునడత గలపాపి యొక్కండు గిరిని
ఎక్కుచో సుప్తు నసురుల్ వధింతు రటనె. 1178

పంపసరసిఁ దేలి మతంగ వని వసించి
గ్రాలు బాల నాగముల యాక్రందనంబు
వినఁ బడును, మబ్బువలె నుండు ద్విపము లెపుడు
కొండొరులు పోరి నెత్తురుతోడఁ దిరుగు. 1179

అవియుఁ జల్లనై సుగంధాన్విత మయి,
హాయి గూర్చు నీటిని గ్రోలి యుండవెఁ దిరుగు
ఎలుగు బంటుల, నీలికెంపు లటు వెలిగి
మోటవేని దుప్పులఁ గాంచియోర్తు రాత్రి. 1180

వ. రామా? ఆపర్వతంబున శిలాపిధానమనునొక్క గుహ గలదు. కాకుత్థా దానిని ప్రవేశించుట చాల కష్టము. ఆ గుహకు తూర్పుద్వారమునఁ జల్లని నీరు గల హ్రదము గలదు. అది ఫలమూలములతో గూడి నానా మృగములచే నావరింపఁబడి యుండును. అందే సుగ్రీవుండు నలుగురు వానరులతోఁ గూడి యొక మాఱు ఆపర్వత శిఖరంబుపైని ఒకమాఱు క్రిందను తిరుగుచునుండును అని కబంధుఁ డారామలక్ష్మణు లిరువురకుఁ జెప్పి మాల ధరించి సూర్యునివంటి రంగు గలిగి వీర్యముతో నొప్పెను. అపు డామహాభాగుఁడైన కబంధుని జూచి మంచిది వెళ్ళి రమ్మని దగ్గరగాఁ జని పలికిరి. అంతఁ గబంధుఁడును మీకార్య సిద్ధికై మీరును వెళ్ళి రండని పలికి బంధులుదేఱి సురూపియై శ్రీయుతుడై రవిని బోలిన దేహముతో పోవుచు రాముని జూచి స్వస్థుడవై మైత్రి చేయుము సుమీ అని పలికి వెడలిపోయెను. 1181

—: ఋశ్యమూక గిరిని జేరి శబరిని చూచుట :—

ఆకబంధుఁడు చెప్పిన యాటు పడమర
దిశగఁ బంపాసరోవర తీర పథిని
వారు వెడలి యుద్రులన్ దేసె లూరు తరులఁ
గనుచు సుగ్రీవుఁ గన్గొనఁ జనిరి ముందు. 1182

వారు కొండపరుల వాసంబు చేయుచు
పంప పడమటి తటి త్వరగఁ జేరి
చక్కని తరు లున్న శబరి యాశ్రమమందు
తరులఁ గనుచు శబరి సరసి కపుడు. 1183

శ్రమణి సిద్ధశబరి రామలక్ష్మణులను
కాంచి దోసి లొగ్గి కాళ్ళ వ్రాలి
అర్హ రీతి పాద్య మర్ఘ్య మాచమనీయ
మెల్ల నొసఁగి పుష్ప నిచ్చె నపుడు. 1184

వ. అపుడు వ్రతమూని యున్న శబరితో రాముఁ డిట్లనియె.

ఇట విఘ్నంబులు పోవఁ ద్రోలుదె తపం బిచ్చోట వర్ధిల్లునే
ఇట నాహారము కోపమున్ నియతమై ఏపార వర్తింతువే
ఇట నాయా నియమాల నుందువె మనం బేపారునే శాంతితో
ఇటఁ గావించెడి వృద్ధ సేవ సఫలంబే చారు సంభాషిణీ ! 1185

అని యిట్లు రాముఁ డనఁగా
విని సిద్ధ విశుద్ధ శబరి వినయముతోడన్
అనియెను రాముని తోడను
తనదు నమాయిక హృదయము తపమును తోఁపన్. 1186

నీదర్శనంబున నేఁడు తపసు పండె
జన్మ మిప్పుడుగదా సఫల మయ్యె
నీవు దేవవరుండ విటు పూజ లందుట
వ్రతము సిద్ధించె నర్చితులు గురులు
నీసౌమ్య దృష్టిచే నేను పావన నౌచు
పడయఁ బోదును గాదె స్వర్గ మింక
నీప్రసాదంబున నేఁడె యక్షయ మైన
భువనంబులను పొందఁ బోవు చుంటి

నీవు చిత్రకూటమున చేర నేను గొల్చు
ధీర ఋషులు విమానాల దివికిఁ జనిరి
ఇట్టి పుణ్యాశ్రమమునకు నీవు వత్తు
వని మహాభాగులు మహర్షు లనిరి గాదె. 1187

అట్టి లక్ష్మణుతో వచ్చు నట్టి యతిథి
రాముని బ్రతిగ్రహింపుమి రాముఁ జూచి
అక్షయం బైన లోకాల నందఁగలవు
అనుచు వారన్న నుడులు సత్యంబు లయ్యె. 1188

వ. ఆ మహాభాగుల వాక్యములను విని పురుషశ్రేష్ఠా! నేను నీకయి పంపాసరస్సు తీరమునఁ గల వన్యఫలాదులను సంపాదించి యుంచితిని" అని శబరి పలుక ధర్మాత్ముఁ డైన రాముఁడు విజ్ఞాన యోగ్యతతో నిత్యము బహిష్కృతురాలు కాని శబరితో నిట్లనెను. దనుపుత్త్రుఁ డగు కబంధునినుండి మహాత్ము లైన మీగురువుల ప్రభావమును విని యుంటిని. నీకిష్టమేని ఆ విన్నదానిని ప్రత్యక్షముగాఁ జూడఁగోరుచుంటిని. అని రాముఁడు పలుక విని ఆ రామలక్ష్మణులకు కాఱుమేఘములవలె నుండి మృగ పక్షుల కలకలారావములతో నిండి యున్న యామహావనమును చూపి రఘునందన! ఇదే మతంగ వనము చూడుము. 1189

ఇట భావితాత్ములై యొసఁగు మాగురువులు
మంత్రయుక్తముగ హోమమ్ము లిడిరి
ఈనిమ్న వేదిని నెంతో వణకు కేల
కడు మాగురులు పూల కాన్క లిడిరి
ఈవేది నేటికి ఈనాగురుల తప
శ్శక్తిచే దిశల శ్రీచాయఁ జిమ్మె
ఈసప్త సాగరా లివె చూడు ముపవాస
ముల ఋషుల్ చనలేక తలప వచ్చె

వారె యభిషేకములు చేసి వల్కలములు
చెట్ల ఆరవేయఁగ అర విట్లు చూడు
దేవపూజ నర్పించిన దివ్యసుమము
లుత్పలమ్ములు వాడక యుండెఁ గనుము. 1190

కనవలసిన యది కంటిని
వినవలసిన దెల్ల నిపుడె వింటివి రామా!
అనుమతి యిచ్చినచో ఈ
తనువును త్యజియించి వైతుఁ దటుకున నిపుడే. 1191

గురువులగు భావితాత్ముల
దరికిని బోవంగ నిపుడె తలచుఁచు నుంటిన్
మఱి యిదియు మునుల యాశ్రమ
మరసియె వారికిని సేవ లటు చేసితిఁగా 1192

అటు ధర్మయుక్తముగఁ జె
ప్పుట రామలక్ష్మణులు విని ముద మతులంబొ
నటుగని ఈ యద్భుత మెం
తటి దని రాముండు శబరి కనంతర మనియెన్ 1193

"స్వేచ్ఛగా నీకు నిచ్ఛయు వచ్చినట్లు
అరుగు నీవల్ల భక్తితో నర్చితుఁడనె"
అనఁగ జడలొప్పు నా వృద్ధురాలు శబరి
చీర కృష్ణాజినము దాల్చి స్వేచ్ఛతోడ 1194

ఆతటిని మేను త్యజియింప నాత్మనెంచి
రాము నాహుతి నగ్ని హోత్రంబునందు
తన్ను నాహుతి గావించి తగ వెలింగె
యగ్నివోలె మెఱసి స్వర్గ మరిగె శబరి. 1195

దివి దివ్యాభరణాలు దివ్య వసనాల్ దివ్య ప్రశస్త గంధంబులం
త విరాజిల్ల మెఱుంగుఁ దీవియవలెన్ తద్దేశమున్ వెల్గఁ జే
సి వెసన్ రాముని ముందు వెం రిలి వాసిన్ మ్రొక్కి ధన్యాత్ములున్
సువివేకుల్ గను స్వర్గముల్ శబరి వేచొచ్చెన్ సమాధిస్థయై. 1196

తన తేజస్సున స్వర్గమున్ శబరి పొందం జూచి, దివ్యాత్ములౌ
ముని సిద్ధాత్ముల యా ప్రభావము, మహత్త్వమున్ పొంగి వీక్షించి మే
లును కాంక్షించెడి భ్రాత లక్ష్మణుని నాలోకించి ప్రావ్రుచ్చె ల
క్ష్మణ వీక్షించితె యా మహాత్ముల మహాశ్చర్యాశ్రమ స్థానమున్ 1197

మృగముల్ వ్యాఘ్రములెట్లు నమ్మి మెలఁగున్ వృక్షంబులన్ పక్షు లె
ట్లు గుముల్ గూడి చరించునో, జలధు లిట్టుల్ కూడి తీర్థంబులన్
మిగులన్ శాస్త్రవిధిన్ జలాలిడఁ బితల్ మేలంచు సంతృప్తి చెం
దఁ గడున్ తర్పితలైరొ వారిఁ గనుమీ నా చిత్తమున్ మోదిలున్ 1198

అశుభంబుల్ నశియించె మంగళములే ప్రాప్తించు ర
మ్య శుచి స్థానము నిషదర్శనమునై పొల్పారు పంపా సర
స్సు నమీపింతము ఋష్యమూక గిరియున్ శోభిల్లె నిచ్చో; నిటన్
వసియించెంగద సూర్య సూతి బహుపుణ్యాత్ముండు సుగ్రీవుడున్. 1199

మదిలో వాలి భయాన, నల్వురు కపుల్ మన్నింప సుగ్రీవుఁ డీ
యదనన్ వాసముచేయు నిచ్చటనె, నెయ్యంబార సుగ్రీవునిన్
హృదిచూడన్ త్వర పెట్టుచుండె మన మింకీవేళనే పోదమా
తదధీనంబయి యున్న దేగదవె సీతాన్వేష ణోద్యోగమున్. 1200

వ. అని ఇట్లు పలుకుచున్న ధీరుడైన రామునితో లక్ష్మణుఁడు అన్నా!
నడువుము నామనస్సు కూడ మిగులఁ దొందర పెట్టుచున్నది. "అనిలక్ష్మణుఁడు

చెప్ప పిదప ఆ రాముఁడు లక్ష్మణుఁడును వెడలి యాపంపాసరోవరమును
సమీపించిరి. 1201

అటు మతంగ సరస మను హ్రదముందు
మునిఁగి వనముల సరసులఁ గనుచుఁ బోయి
రామలక్ష్మణుల్ చేరి దూరమున నుండి
రమ్య మైనట్టి పంపాసరస్సు గనిరి. 1202

పుణ్యమౌచు నుదార పురుషసేవిత మౌచు
తరులతల్ శుచి నీరు వలల నొప్పి
కలువ తొవ తెలికల్వల చెంగలువలచే
తెలు పెర్పు నీలి కంబళముఁ బోలి
అలరి పక్షులు కూయు నలరుఁ దోటల నొప్పి
భ్రమర ఝుంకారాల శ్రావ్య మగుచు
స్పటికాచ్ఛ నీరాలు శ్లక్ష్ణవాలుకలును
వెమిళుల నృత్యాలు నమరియుండి

చిలుక కొక్కెర బెగ్గురు లలరిహూను
తిలక వకుళ కుందాశోక తిందుక ధవ
కేతకాదు లన్ నగలొప్పునాత్రిఁబోలి
క్రమ్ము వనిదరిన్ బంపాసరమ్ము దనరె. 1203

అట్టి పంపాసరసు రాముఁ డరసి యునియె
అనుజ! యీతటిన్ ఋశ్యమూకాద్రి గలదు
ఋక్షరజుసూతి సుగ్రీవుఁడిట వసించు
లక్ష్మణా! నీవరిగి వానరాగ్ర్యుఁగనుము. 1204

దీనజనుడ రాజ్యభ్రష్టుఁ డైనవాఁడ
సీతయందు నాసక్తమైచిత్త మడపు
భార్య సీత లేకుండ నే బ్రదుకఁజాల
అనుచుఁ గామార్తిఁ బంపలో మునుక లాడె. 12

ఇది

చర్ల జనకగురుప్రాప్త విద్యుడును వెంకమాంబా పుత్రుడును
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁడిన గణపతి వాల్మీకి
రామాయణసుధ యందు అరణ్యకాండము.

అరణ్యకాండము సమాప్తము

—:×:—